Photo by V. H. Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

విద్యుత్‌గానం

పంపినవారు:
సి. పి. శ్రీనాథ్ - వెల్లూరు




# తండ్రి

(తెలుగు)

బి.యస్. సరోజ...తిక్కురిసి...ప్రేమ్ నజీర్

N44

*Release thro:* THE VAUHINI PICTURES LTD..

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవన్నీగాక బదులుచెప్పు - తొమ్మిదిమహత్వం - ఫోటోవ్యాఖ్యల పోటీ - మరి అనేకమైన ఆకర్షవంతమగు కొత్తశీర్షికలు



వినోదా వారి

# దేవదాసు

...శరత్ బాబు రచించిన ప్రఖ్యాత నవల...

దర్శకత్వం.... వేదాంతం రాఘవయ్య

సావిత్రి... లలిత... నాగేశ్వరరావు... రంగారావు... సి.యస్.ఆర్... పేకేటి...

N44

స్టూడియోస్... నెప్ట్యూన్ & రేవతి...

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లైంట్లు, గత నెలలో చేరలేదనే కంప్లైంట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచిక చేరేసరికి మీరు సెలవలలో కులాసాగా కాలక్షేపం చేస్తూవుంటారు. కాలక్షేపం అనగానే కాలాన్ని వ్యర్థంచేయడమని కొందరి వుద్దేశం. కాని అది పొరపాటు. మీలో చాలా మందికి, ఏడాది పొడుగునా చదివే పుస్తకాలు ఒకమూల పడవేసి, అవకాశం ఉన్నంతలో ప్రయాణాలుచేద్దామని కుతూహలం వుంటుంది. వీలైనన్ని కొత్త కొత్త ప్రదేశాలు చూడాలని సరదా వుంటుంది. ఇవి నిజానికి, చాలా మంచి వుద్దేశాలని గట్టిగా చెప్పవచ్చు. ప్రపంచవిఖ్యాతి పొందిన మన రవీంద్రకవికి పుస్తకాల మీదకంటె కూడా పర్యటనచేయడంమీదనే ఎక్కువ మక్కువగా వుండేది. తరుచు ప్రకృతిదృశ్యాలను చూడటంలోనూ, ఆ సౌందర్యంలో లీనమైపోవటంలోనూ ఆయన ఎక్కువ కాలాన్ని వినియోగించేవాడు. దీనిని బట్టి, పర్యటనంచేయటం సరదాకోసమే కాదు, దానివల్ల తగినంత ప్రయోజనంకూడా వుంటుందని మనం తెలుసుకోవాలి.

సంపుటి 12 :: మే 1953 :: సంచిక 5

SANKAR...

# చీమలు-రాజు

అనగనగ ఒక రాజు
అతడు అతి బలశాలి.
పేదసాదల అండ,
యముడు దుష్టులపాలి.

ఖగమృగాదులభాష
కీటకాదుల భాష
ఎరుగు అతడన్నియూ,
లేదు తెలియనిభాష !






ఒకరోజు అతడు తన
సతీ సుహృదులకూడి
ఒక వన్యమార్గాన
పయనించుచున్నాడు.
ఇంతలో చూచాడు
పెద్ద చీమల బారు.
అవనుకొంటున్నాయి—
'రాజుగారొచ్చారు.
మనకు మూడిందింక
నేల రాసేస్తారు.
పురుగు లెవరికి లెక్క ?
దొడ్డ ప్రభువులు వారు.'





రచన:
బైరాగి

'ఆర్తరక్షణ రాజ
ధర్మమన్నది ధృవం.
సబలమైనది చాల
అబలరోదనరవం.'

అని గిరుక్కునమరలి
త్రోవ తా చూపాడు.
ఊరకే పోలేదు
చిట్టిచీమల గోడు.



చీమ పలుకులువిన్న
చతురధరణీపతికి
వింతగా తోచి ఇది
చెప్పాడు నిజ సతికి.

అవిడన్నది-'అహా!
ఏమి చీమల పొగరు?
రాజుకా దూషణలు!
అణచరాదా పొగరు?'

రాణి మాటలు చెవిని
పెట్టలేదా రాజు.
అన్నాడు వెంటనే
ఆ మంచి మహారాజు—

# అట్టపిరా ది బొమ్మ

విద్యలు పూర్తిఅయినతరువాత ద్రోణాచార్యులు శిష్యులందరినీ పిలిచి, "నా గురుదక్షిణమాట యేమిటి?" అని అడిగాడు. అందరూ చేతులుకట్టుకు నిలబడి, 'మీరేమి కోరినా ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నా'మన్నారు. అప్పుడు ద్రోణుడు "నాకు కావలసిందల్లా ఒక్కటే: ఐశ్వర్యగర్వంతో మిట్టిపడుతున్న ఆ ద్రుపదుణ్ణి ఒడిచికట్టి తీసుకురావాలి' అని చెప్పాడు.

'ఓస్, దీనికేముంది!' అంటూ వారు కవచాలు ధరించి, అస్త్రశస్త్రాలు చేతపట్టి, రథాలు తయారుచేసుకుని, ద్రుపదునిపైకి యుద్ధానికితయారై వెళ్లారు. అందరూ వెళ్ళారుకాని, అర్జునుడుమాత్రం అప్పుడు వెళ్ళలేదు.

ఈ వార్త ముందుగానే తెలిసిన ద్రుపదమహారాజు తన సైన్యాలను సిద్ధం చేసుకొని తలపడ్డాడు. గొప్ప యుద్ధం జరిగింది. ద్రుపదుని బాణాలు కౌరవుల కవచాలను చీల్చిచెండాడినై. కురుకుమారులందరూ చావుదెబ్బలు తిని, పాండవులున్న చోటికి చేరుకున్నారు.

అప్పుడు అర్జునుడు గురువుకు ప్రణమిల్లి, ధర్మరాజుకు నమస్కరించి, అనుమతిపుచ్చుకొని, ద్రుపదునిమీదికి అత్యుత్సాహంతో బయల్దేరాడు.

బ్రహ్మండమైన మత్స్యాలు సముద్రాన్ని అల్లకల్లోలంచేసేటట్టుగా భీముడు గదాపాణి అయి, ద్రుపదుని యేనుగులను కొట్టాడు. అవి కొండలలాగా క్రింద కూలుతూవచ్చినై. ద్రుపదుని సైనికులు నివ్వెరపడి చూడసాగారు. గురువు ఆజ్ఞ నెరవేర్చాలనే గట్టి పట్టుదలతో అర్జునుడు ప్రళయకాలపుటగ్నిలాగా ప్రజ్వరిల్లి, ద్రుపదుని రథం చుట్టుముట్టి, మహారథుడైన ఆ ద్రుపదునిపైన ధారాపాతంగా శరవర్షం కురిపించాడు. అయేసరికల్లా ద్రుపదుడు అదృశ్యుడయ్యాడు! పాంచాల సైన్యంలో హాహాకారాలు చెలరేగినై. అప్పుడు ద్రుపదుణ్ణి రక్షించటానికని సత్యజిత్తు అర్జునుడితో యుద్ధంచేశాడు. కాని, వాని రథం కూలిపోయింది. సైన్యం చెదరిపోయింది. సత్యజిత్తు పలాయితుడయ్యాడు.

అప్పుడు మళ్ళీ అర్జునుడికీ ద్రుపదుడికి మధ్యని ఘోరమైన యుద్ధం జరిగింది. అర్జునుడి దెబ్బలకు తట్టుకోలేక ద్రుపదుడు పారిపోబోతుండగా వానిని అర్జునుడు పట్టి, కట్టి, ద్రోణాచార్యునివద్దకు తీసుకపోయి, ఆయనకు తన గురుదక్షిణగా సమర్పించాడు.



# నీతి గల లేడి

బ్రహ్మదత్తుడు కాశీనగరాన్ని పరిపాలించే కాలంలో, ఒకప్పుడు బోధిసత్వుడు లేడిగా జన్మించాడు. ఆ లేడి బంగారులేడి. దాని కన్నులు కెంపులలాగా మెరిసిపోతూన్నయి. గిట్టలు వెండివాటిలాగా తళతళలాడుతున్నై. దానినోరు లక్క పూసినట్టు ఎర్రగా వున్నది. ఆ బంగారులేడి, ఒక మర్రిచెట్టుకింద నివసిస్తూ, ఐదువందల లేళ్ళుగల ఒక మందకు పెద్దగావుంటున్నది. దానికి 'మర్రిచెట్టులేడి' అని పేరు.

ఆ సమీపంలోనే ఒక రావిచెట్టుకింద మరి ఒక లేడి నివసిస్తున్నది. అదీ బోధిసత్వుని లాగా అందమైన లేడే. బంగారపుఛాయదే. దాని పెద్దరికంకిందకూడా ఒక ఐదువందల లేళ్ళు గల మంద ఉంటున్నది. దీనికి 'రావి చెట్టులేడి' అనిపేరు.

ఆ కాలంలో కాశీరాజుకు వేట ఒక వ్యసనంగా ఉండేది. రోజూ తనవెంట వేటకు రమ్మని ప్రజలనందరినీ నిర్బంధించేవాడు. ఈ ఒత్తిడి సహించలేక, ముఖ్యులు పది మంది ఒకచోట కూడి ఇలా యోచించారు:

"ఈ రాజుకిపట్టిన వేటపిచ్చివల్ల మన పనులన్నీ నాశనమవుతున్నయి. ఈ బాధ తప్పించుకునేటందుకు—రాజుగారి తోట లోనే తిండీ, నీళ్లూ సదుపాయంచేసి, లేళ్ల మందను తెచ్చి వదిలితేనో!" అని అనుకున్నారు. ఇందుకు అందరూ సమ్మతించారు. అనుకున్నట్టే తోటలో మంచి గరికె మొలిపించి, నీటివసతి అమర్చి, సిద్ధంచేశారు.

జనమంతా కలిసి, అడవులకు పోయి లేళ్ళను పట్టసాగారు. వాళ్లు పట్టిన వాటిలో, లేళ్ళమందల పెద్దలైన మర్రిచెట్టు లేడీ, రావిచెట్టులేడీ దొరికిపోయినై. పట్టిన లేళ్ళనన్నిటినీ వాళ్ళు సిద్ధంచేసివుంచిన తోటలోపలికి తరుముకుపోయారు. అన్నీ తోటలోపలికి పోగానే ద్వారం మూసివేశారు.

హెచ్. ఆదినారాయణ




తరువాత వాళ్ళు రాజువద్దకు పోయి, "ప్రభూ!—మా పనులు పాడుగాకుండా, మీ సౌకర్యంకోసం మేమీఏర్పాటు చేశాము. దయవుంచి, యిటుపైన ఆ తోటలో లేళ్లను మీ ఇష్టారాజ్యంగా వేటాడి, అరగించవచ్చు" అని విన్నవించారు.

వాళ్లకోరికప్రకారం, రాజు వెళ్ళి తోటలో చూచేసరికి బంగారుఛాయగల లేళ్లు రెండూ కంటబడినై. వాటిని చూచి ముచ్చటపడి, 'ఈ రెండింటినీమాత్రం కొట్టకూడదు' అని అజ్ఞాపించాడు. వేటకు రోజూ రాజే వెళ్ళేవాడు. ఒక్కొకప్పుడు వంటవాడు వెళ్లేవాడు.

రాజు ఎక్కుపెట్టిన బాణం చూడటంతోనే లేళ్లు భయపడి, చెల్లాచెదురుకావటం, దెబ్బతిన్న లేళ్ళు లెక్కలేకుండా, చచ్చిపడిపోవటమూ మామూలయింది. అప్పుడు మర్రిచెట్టులేడి ఐన బోధిసత్వుడు రావిచెట్టు లేడిని పిలిపించి, ఇలా అన్నది:

"మిత్రమా!—వేటలో మన లేళ్ళు లెక్కాపత్రం లేకుండా చచ్చిపోతున్నాయి. చచ్చేవి చస్తూవుండగా, అనవసరంగా అనేకమైన లేళ్ళు దెబ్బతింటున్నాయి. రోజూ ఒక లేడిఐనా చచ్చేతీరాలి కనుక, వంతులు ఏర్పరుద్దాం. వంతువచ్చిన లేడి తిన్నగా వధ్యశాలకు పోవటం, కత్తికింద కొయ్యమీద మెడ చాచటం మామూలుచేదాం. ఇలా ఐతే, తక్కిన లేళ్లకు దెబ్బలు తప్పుతై."

ఈ ఏర్పాటు రావిచెట్టులేడికి నచ్చింది. అది సమ్మతితెలపగానే, నాటినించీ ఒకొక్క మందలోనించి రోజూ ఒకొక్క లేడి వధ్యశాలకు పోయి, కత్తికింది కొయ్యపైన మెడ పెడుతూవచ్చింది. ఇందువల్ల మందలలో వుండే తక్కిన లేళ్లకు దినదినగండం తప్పిపోయింది.

ఇలావుండగా, ఒకరోజున—

రావిచెట్టులేడి మందలో వుండే ఒక చూలులేడికి వంతువచ్చింది. వెంటనే అది

తన యజమానివద్దకు వెళ్ళి "నేను నిండు చూలాలిని. ఇక కొద్దిరోజులు పోతే నేనూ నా బిడ్డాకూడా రాజుగారి ఫలహారానికి ఉపయోగపడతాము. కనుక, ఇప్పటిమట్టుకు నన్ను వదిలిపెట్టండి" అని అనేకవిధాల ప్రాధేయపడింది.

అందుకు రావిచెట్టులేడి "టట్, అలా వీల్లేదు, యెవళ్ళకర్మ వాళ్ళు అనుభవించి తీరవలిసిందే. నీ వంతుకి మరొకళ్ళను పంపటం పనికిరాదు" అని నిష్కర్షగా చెప్పింది. అప్పుడు ఆ చూలులేడి బోధిసత్వుడిదగ్గరకు పోయి తన విచారగాథ వలపోసుకుంది.




బోధిసత్వుడు అంతావిని, "నీకువచ్చిన భయమేమీలేదు. నువు వెళ్ళు. నీప్రాణానికి నాప్రాణం అడ్డు" అని ధీమాచెప్పి పంపాడు. ఆ చూలులేడి వెళ్ళగానే, మర్రిచెట్టులేడి సరాసరి వధ్యశాలకు పోయి, తల కత్తికింది కొయ్యపైన పెట్టి నించుంది.

అంతలో రాజుగారి వంటలవాడు వచ్చి చూచి, ఆశ్చర్యపోయాడు. "ఇదేమిటి! ప్రభువువారు క్షమించి వదిలిన ఈ బంగారు లేడి వచ్చి నించుందేమిటి!!" అంటూ, పోయి, యీవార్త రాజుకు చెప్పాడు. ఈ వార్త వినగానే రాజు రథంయెక్కి, పరివారంతోసహా అక్కడికి వచ్చేశాడు. వచ్చి బోధిసత్వుడితో "ఓ లేళ్ళరాజా!—నిన్ను స్వేచ్ఛగా ఉండమని వదిలిపెట్టాముకదా! నీవువచ్చి ఇలా మామూలు లేడిలాగా కత్తికింద మెడపెట్టడమేమిటి?" అని అడిగాడు.

"ప్రభూ!–ఇందులో మరేమీ విపరీతం లేదు" అంటూ, ఆరోజు వంతు వచ్చిన చూలులేడి కథ అంతా వినికిడిచేసింది.

మర్రిచెట్టులేడిమాటలు మెచ్చుకొన్నాడు రాజు. 'ఓ లేళ్లరాజా!–నీవంటి ఉదారుణ్ణీ, కరుణాళువునీ, ప్రేమమూర్తినీ మానవ

జాతిలో కూడా ఎక్కడా నేను చూడలేదు. నిన్నుచూస్తే నాకు చాలా సంతోషమవు తున్నది. లే. నిన్నూ ఆ చూలు లేడినీకూడా వదిలేస్తున్నాము' అన్నాడు.

'దేవరా!-మా రెండు ప్రాణాలుమట్టుకు మీరు రక్షిస్తే అంతమాత్రాన ప్రయోజనం యేమున్నది? మీ అజ్ఞపల్ల, తోటలో వుండే ఒక్కలేడిప్రాణం కాపాడినట్టు అవుతున్నది. మరి, తక్కిన అన్నిటిమాటా యేమిటిప్రభూ!' అని అడిగింది మర్రిచెట్టు లేడి.

"వాటినీ వదిలేస్తున్నాం" అన్నాడు రాజు, ఎంతో ఉదారంగా.

"లేళ్లనుమాత్రం ప్రభువులు వదిలేస్తే యేమైనట్టు?— అడవిలో చతుష్పాత్తులు ఎన్నో వున్నాయికదా? అవికూడా లేళ్లవంటి ప్రాణులేకదా? అవిమాత్రం రక్షింపబడ వద్దా?" అని మళ్లీ అడిగింది మర్రిచెట్టులేడి.

"సరి, జంతువులన్నిటినీ వదిలి పెట్టేస్తాం." అని అభయమిచ్చాడు రాజు.

అంతటితో ఊరుకోలేదు మర్రిచెట్టులేడి, "ఏలికా!—చెట్లమీది పక్షులూ, నీటిలోని చేపలూకూడా మనవంటి ప్రాణులేకదా! జంతువులనూ పక్షులనూమట్టుకు ప్రభువులు రక్షిస్తే ఏమైనట్టు?" అని మళ్ళీ ప్రశ్నించింది.

"అవును. నువు చెప్పినమాట చాలా సబబుగా వున్నది. ప్రాణులన్నిటినీ తాకకుండా వదిలేస్తున్నాం" అని వాగ్దానం చేశాడు రాజు.

ఇలా ప్రాణికోటి అంతటిపక్షానా రక్షణ పొందటానికి వాగ్దానం తీసుకొన్నతరువాత బోధిసత్వుడు: "రాజా!—ధర్మం నిలబెట్టు. న్యాయం పాలించు. ఈ ప్రపంచంలో గల ప్రాణికోటి అంతటినీ దయతో చూడు. తరించు" అంటూ, ఎన్నో నీతులు బోధించాడు. తరువాత మళ్ళీ అడవిలోని తన స్థానానికి తను వెళ్ళిపోయి నిశ్చింతగా వుంటున్నది, మర్రిచెట్టులేడి.






ఇంతలో ఎక్కడినుంచి వచ్చిందో, ఒక బాణం జుంయ్యిమంటూ కాలపాశంలా వచ్చి ముసలిగంగులు గుండెలో గుచ్చుకొన్నది. దెబ్బతో క్రిందపడిపోయా డతను. జాలిగుండె గల విజయవర్మ అతని గుండెలో గుచ్చుకొనివున్న బాణం లాగివేశాడు. పాపం, గంగులు ఒక్కసారి 'అబ్బా!'— అని మూలిగి ప్రాణాలు వదిలాడు. బాణం చేతిలో పట్టుకొనివున్న విజయవర్మ దానిని పరీక్షించి చూచి, 'ఇది చాలా చిత్రమైన బాణం' అన్నాడు. ఆ బాణంమీద "గంగులుకు 'శబ్దవేధి' కానుక" అని చిన్న అక్షరాలతో చెక్కివుంది. ఆ శబ్దవేధినిగురించిన ఈ చిత్రకథ కొన్నివందల ఏళ్ళనాటిది:

---

నేడు మధ్యప్రాంతమని పిలువబడుతున్న వింధ్యాచల పరిసరప్రాంతం ఆనాటికి చిన్న చిన్న రాజ్యాలుగా విభజింపబడి వుండేది. అప్పటికి హిందూ, బౌద్ధ సామ్రాజ్యాలు అంతరించిపోయినై. కాని మొగలులు ఇంకా అడుగుపెట్టలేదు. చాలా గడ్డురోజులవి. అదుపులో పెట్టేవారు లేక చిన్నచిన్న సామంతులు తమలోతాము కొట్లాడుకుంటూ వుండేవారు. దేశం అరాచకంగా, అల్లకల్లోలంగా ఉండేది. ఆబోతుల పోరులో లేగదూడలు నలిగిచచ్చినట్టు ఈ ప్రభువుల కొట్లాటల్లో ప్రజలు నలిగిచచ్చేవారు. సరే, ఇక జమీందారుల సంగతీ, ఖామందుల సంగతీ చెప్పేదేమిటి? ఒక్కొక్కరు ఒక్కొక్క చిన్నదండు ప్రోగుచేసి వాటి సాయంతో లోకులను దోచుకొంటూ ఉండేవారు. ఇందువల్ల ఆరోజుల్లో ఏ అండా లేని పేదవారికి బొత్తుగా రక్షణ వుండేదికాదు




నాడు వింధ్యపరిసరాల్లో పెద్దరాజ్యాలని చెప్పతగినవి రెండే ఉండేవి: ఒకటి బీస ల్పూరు రాజ్యం. రెండవది కోసల్పూరు రాజ్యం. ఈ రాజ్యాల అధిపతులిద్దరూ సూర్యవంశీయులు. వారి తాతలు అన్న దమ్ముల బిడ్డలు. ఏదో గృహకలహం వచ్చి ఇదివరకు ఒకటిగా వస్తున్న బీసల్పూరు రాజ్యాన్ని ఇద్దరూ చెరిసగం పంచుకొన్నారు. ఈవిధంగా కోసల్పూరురాజ్యం ఏర్పడింది.

అప్పటినుంచి ఈ రెండు రాజ్యాల మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గున మండుతూ వచ్చింది. దాయాదులపోరు ఎవ్వరెరుగనిది! మన కథాప్రారంభాన ఒకనాటి సాయం కాలం, కోసల్పూరు సరిహద్దులలోని గిరికోటలో రణభేరి మ్రోగసాగింది. గిరికోట కోసల్పూర్‌లోనిదే ఐనా బీసల్పూర్ రాజ్య సరిహద్దును తాకుతూ ఉంటుంది. ఆ కోట యజమాని పేరు భీమవర్మ. ఆయన ప్రస్తుతం కోటలో లేడు. సైనికులతో సహా రామనగర్ వెళ్ళిఉన్నాడు. ఇప్పుడు ఆయన పురోహితుడూ, అంతరంగిక మిత్రుడూ ఐన సోమశర్మే దుర్గాధిపతి.

రణభేరి వినగానే, రామనగర్ వెళ్ళగా కోటలో మిగిలివున్న పురుషులంతా ఎక్కడి పని అక్కడనే వదిలేసి, మొగసాలవద్ద ప్రోగయినారు. అక్కడ పదిహేడు పద్దెనిమి దేండ్ల రౌతు ఒకడు సమస్తమైన ఆయు ధాలూ ధరించి నిలబడిఉన్నాడు. అతడే భీమవర్మ పెంచుతున్న యువకుడు. అతని పేరు విజయవర్మ.

ఈ ప్రోగయిన పౌరులు 'అసలుసంగతి ఏమిటి?' అని ఒకరినొకరు ప్రశ్నించుకోవటం చూచి ఆ యువకుడు మళ్ళీ కోసల్పూరు, బీసల్పూర్ రాజ్యాల రెండిటిమధ్యా యుద్ధం జరుగబోతున్నదనీ, భీమవర్మ గారలు ఆయుధం పట్టగల ప్రతి పురుషుణ్ణీ తోడ్కొని రమ్మని కబురంపారనీ, వారికి చెప్పాడు.






ఈ సైనికుల జట్టుకు రామసింగు నాయకుడుగా వుంటాడనీ, సోమశర్మగారు ఈ విషయమై స్వయంగా అజ్ఞాపిస్తారనికూడా చెప్పాడు ఆ యువకుడు.

ఈవార్త విని జనులు రకరకాలుగా మాట్లాడుకొనసాగారు. దుర్గాధిపతి ఐన భీమవర్మ అంటే వారికెవరికీ అట్టే ఇష్టంలేదని ఆ మాటలవల్ల స్పష్టంగా తెలుస్తుంది. ఇంతలోనే గుర్రం ఎక్కి రామసింగుకూడావచ్చాడు.

వచ్చీరావటంతోనే అతడు 'అంతా సిద్ధంకండి. చీకటి పడకముందే మనం బయలుదేరాలి' అన్నాడు. రామసింగు అంటే భీమవర్మగారికి కుడిబుజంలాంటివాడు. ఆయన అజ్ఞప్రకారం ఎక్కడివాళ్ళక్కడ అంతా సిద్ధంకాసాగారు. ఇంతలో రామసింగు ఒకనిని పిలచి 'ముసలి గంగు ఎక్కడ?' అని అడిగాడు.

'బహుశా చేనుపనిలో ఉండివుంటాడు' అని ఆ వ్యక్తి జవాబుచెప్పాడు. ముసలి గంగులు చేను కోటబయట వున్నది. విజయవర్మా, రామసింగూ ఇద్దరూ అక్కడికి దౌడుతీశారు.

ముసలిగంగులు చేలో పనిచేసుకుంటూ ఏవో కూనిరాగాలు తీస్తున్నాడు. వీళ్ళిద్దరూ వచ్చిన అలికిడి విన్నాడో లేదో, తలెత్తికూడా చూడలేదు. 'ఏమయ్యా గంగయ్యా! నీకు పిలుపు వచ్చింది. ఇప్పుడే వచ్చి కోటలోని సైనికులకు నాయకత్వంవహించమని సోమశర్మగారి అజ్ఞ' అని అన్నాడు రామసింగు.

'నువ్వు ఉన్నావుగదయ్యా' అన్నాడు గంగులు నవ్వుతూ. 'ఆయన వుండడు. కోటలో ఉన్నవారందరినీ ప్రోగుచేసుకుని ఆయన రామనగర్ వెళ్లబోతున్నాడు, భీమవర్మగారు కబురంపించారు' అన్నాడు విజయవర్మ.

'అయితే మరి నేనిక్కడ నాయకత్వం వహించే దెవరికి?' అన్నాడు గంగులు.






'ఆరుగురు సైనికులూ, సోమశర్మగారూ ఇక్కడ వుంటారు' అన్నాడు రామసింగు. కాని గంగులు అతని మాట విననేలేదు.

అతడు దగ్గరలోనే ఉన్న అరణ్యంవైపు చూస్తున్నాడు. 'ఏమిటంత దీక్షగా చూస్తున్నావు?' అని అడిగాడు రామసింగు. 'పక్షులు' అన్నాడు గంగులు అలాగే చూస్తూ. రెండువందల గజాల దూరంలో ఉన్న చెట్లగుబురుమీద ఒక పక్షులగుంపు చెల్లాచెదురుగా ఎగురుతూ అరుస్తున్నది.

'పక్షుల్ని చూచేదేమిటయ్యా?' అన్నాడు రామసింగు. 'అదే తెలివితక్కువ. పక్షులంటే అరణ్యానికి కాపలా. క్రొత్త వాళ్ళెవరు వచ్చినా వాటి అలజడివల్ల మనకు ముందే తెలుస్తుంది. ఇప్పుడా చెట్ల గుబురులో శత్రువులే పొంచి ఉన్నారనుకో, నీ కెలా తెలుస్తుంది?' అన్నాడు గంగులు.

'శత్రువు లెక్కడినుంచి వస్తారయ్యా ఇక్కడికి? రాంనగర్‌లో ఉన్న మన సైన్యాలు తప్ప దగ్గరలో వేరే సైన్యాలు లేనిదే?' అన్నాడు రామసింగు. 'ఓయి పిచ్చివాడా! భీమవర్మనూ, అతని అనుచరులనూ దెబ్బతీయడానికి వేరెక్కడినుంచో రావాలటయ్యా శత్రువులు? ఈ చుట్టుపట్ల ఉన్నవారిలో మనని ద్వేషించని వారెవరు?' అన్నాడు గంగులు.

రామసింగు నోటినుంచి కొంచెంసేపు మాట రాలేదు. గంగులు చెప్పినది నిజమన్న సంగతి అతనికి బాగా తెలుసు. 'సరే, సరే, ఇక పద. సోమశర్మగారు ఇప్పటికే మండిపడుతూ ఉంటారు. ఐనా నీ నోటికి హద్దులేదు' అన్నాడు. ఇంతలో ఎక్కడినుంచి వచ్చిందో, ఒక బాణం జుంయ్యిమంటూ కాలపాశంలా వచ్చి ముసలి గంగులు గుండెలో గుచ్చుకొన్నది. దెబ్బతో క్రింద పడిపోయా డతను. రామసింగు ఒక్కగంతువేసి దగ్గరనే ఉన్న ఒక



బండరాయి వెనుక దాగాడు. విజయవర్మ తన ధనుస్సు తీసి, బాణం ఎక్కుపెట్టి అరణ్యం వైపు చూడసాగాడు. కాని అరణ్యం ప్రశాంతంగా ఉంది. ఆకు ఐనా కదలలేదు.

రామసింగూ, విజయవర్మా బాధతో కొట్టుకలాడుతున్న గంగులువద్దకు వెళ్లారు. బాలిగుండెగల విజయవర్మ అతని గుండెలో గుచ్చుకొనివున్న బాణం లాగివేశాడు. పాపం, గంగులు ఒక్కసారి 'అబ్బా!' అని మూలిగి ప్రాణాలు వదలాడు.

చేతిలో బాణం పట్టుకొనివున్న విజయవర్మ దానిని పరీక్షించిచూచి 'ఇది చాలా చిత్రమైన బాణం' అన్నాడు. 'ఏదీ, నన్ను చూడనీ?' అని రామసింగు బాణం తీసికొనబోయాడు. విజయవర్మ బాణంమీదనున్న నెత్తురు తుడిచి చూపించాడు. ఆ బాణం మీద "గంగులుకు 'శబ్దవేధి' కానుక" అని చిన్న అక్షరాలతో చెక్కవుంది. 'శబ్దవేధి? ఎవరీ శబ్దవేధి? దొంగపేరులాగుందే? సరే, మనకూడా ఇదేగతి పట్టిందాకా ఇక్కడ ఎందుకు కూచోవాలి? గంగులు లేడుగనుక కనీసం గంగులు శవాన్నయినా తీసుకపోదాం పద' అన్నాడు రామసింగు.

ఇద్దరూ కలిసి గంగులు శవాన్ని దగ్గరలోనే ఉన్న అతనింటికి మోసుకువెళ్ళారు. వెంటనే సోమశర్మకు ఖబురువెళ్ళింది. అతడు కొద్దిసేపట్లోనే 'ఏమయ్యా! ఏమి జరిగిందేమిటి?' అంటూ వచ్చాడు. 'ఇంకేం జరగాలనీ? గంగులును చంపేశారు!' అన్నాడు రామసింగు.

ఈ వార్త వినగానే సోమశర్మకు ముచ్చెమటలు పోశాయి. ముఖం వెలవెలబోయింది. కాళ్లు గజగజ వణికాయి. ఆసనంమీద కూలబడ్డాడు.

'ఇది ఎలా జరిగివుంటుంది?' అని బొంగురుగొంతుకతో అన్నాడు. అప్పుడు



విజయవర్మ అతనికి ఆ బాణం చూపించాడు. 'శబ్దవేధి? శబ్దవేధి పేరుతో నాటక మాడుతున్న ఈ శత్రువు ఎవరు? మన చెరుపు కోరేవారు చాలమంది ఉంటారు. కాని ఇంతటి సాహసం ఎవరికుంది! ఎవడితడు? బాబూసింగా? కాదు. ప్రమార్ వంశంవాడా? కాదు. మరెవరై ఉంటాడు? ఏమంటావు సింగూ!' అన్నాడు సోమశర్మ.

'చండీదాసు కాగూడదా?' అన్నాడు సింగు.

'లేదు. లేదు.' అలాంటివాళ్ళకి అంత సాహసం ఎన్నడూ కలగదు. మళ్ళీ యుద్ధం రేగబోతుంది. తప్పకుండా ఎవడో టీసల్పూరువాడే ఈ పని చేసివుంటాడు' అన్నాడు సోమశర్మ. 'మీరు ఇలేవారండీ? అన్నీ తెలిసీ ఇలా అంటారేం సోమశర్మగారూ! మన భీమవర్మగారికి ఒక పక్షమనేది లేదన్న విషయం ఎవరికి తెలియదు? గిట్టుబాటుగా ఉండేపక్షం ఉంటాడాయన. శత్రువులు బయటనుంచే రావాలా? ఆయన ఎన్ని కొంపలు కూల్చలేదు? ఎన్ని ఘోరాలు చేయించలేదు? ఎన్ని నిండు ప్రాణాలు తీయలేదు?' అని ఆవేశపడుతూనే సింగు హఠాత్తుగా ఆగిపోయాడు.

సోమశర్మ చల్లగా అంటున్నాడు—'సింగూ, నీ నోరు కొంచెం దురుసు. ఎందుకైనా మంచిది. కొంచెం అదుపులో పెట్టుకో. తరువాత విచారించి లాభం లేదు' అని, మాటమార్చి 'గంగులు లేడు. నిన్ను పంపితే కుదరదు. నువ్విక్కడే ఉండాలి. కాలం మంచిది కాదు' అన్నాడు.

ముగ్గురూ బయటకు వచ్చారు. వొచ్చి గుర్రాలెక్కి మొగసాలవైపు వెళ్ళారు. అక్కడ ప్రోగైవున్న సైనికులను చూడగానే సోమశర్మకు కొంత ఊరట కలిగింది. 'పరవాలేదు. భీమవర్మగారు కోపపడవలసిన పని ఉండదు' అన్నాడు. ఇంతలో 'అతనెవరు?' అంటూ సింగు ఉలిక్కిపడ్డాడు.

ఎవడో మొగసాల వెనుకనుంచి పారిపోతూ కనుపించాడు. 'పట్టుకోండి, చూస్తారేం?' అని సింగు ఒక్క కేకవేసి గుర్రాన్ని దౌడుతీయించసాగాడు. చాలా మంది అతనిని అనుసరించారు. కాని అందరికంటే తెలివైన పని చేశాడు విజయ వర్మ. బాణం ఎక్కుపెట్టి కొట్టాడు. కాని గురి సరిగా లేకపోవటంవల్ల బాణం ఆక్రొత్త వాని గుర్రాన్ని రాసుకొంటూపోయింది.

ఐతే, అతడు అదృష్టవంతుడు. అందరినీ తప్పించుకొనిపోయి అరణ్యంలో మాయ మయ్యాడు. నిరాశచెంది తిరిగివచ్చారు అంతా. ఇంతలో నారాయణ—సోమశర్మ అనుచరుడు–'ఇదేమిటో చూడండి' అంటూ ఒక లేఖ పట్టుకొచ్చాడు. దానిమీద చిత్రమైన పాట ఒకటి రాసివుంది. సోమశర్మ ఆపాట ఇలా చదువసాగాడు:—

నాదగ్గరనే వున్నాయండీ, నాలుగు బాణాలు.
మంచి వాడిగలవవి, తీస్తాయా దుష్టుల ప్రాణాలు.
ముసలిగంగుగుండెల నొకబాణం రివ్వున దూసింది.
శాస్తిజరిగినది ముసలిగంగులుకు,తప్పదు రాసింది.
క్రూరుడు రామసింగుకోసం ఒకబాణం దాచాను.
వాడేగావా సోంనగర్ తగలెట్టిన సైతాను.
సోమశర్మకోసం ఒకబాణం దాచేవుంచాను.



అభయవర్మ గొంతుక కోశాడే చేతులార తాను.
భీమవర్మ ద్రోహికి నాల్గవదే, కాదనగలదెవడూ?
యాదపవంశపు ముసలం వాడే, వాడుకాక ఎవడు?
ద్రోహుల్లారా! మీమీ చేతలు తలచుకొనండింకా.
మీ వేల్పులు ఎవరన్నా వుంటే పిలుచుకొనండింకా.

ఇట్లు శబ్దవేధి,
అతని అనుచరులు.

ఇది చదివి సోమశర్మ 'అయ్యొయ్యో! ఎంతఘోరం! ఎంతఘోరం! పైగా నేను అభయవర్మ గొంతు కోశానట. ఇంతకంటే పచ్చిఅబద్ధం ఇంకేమన్నా వుందా?' అనటం మొదలెట్టాడు.

అప్పుడు రామసింగు అతని దగ్గరకు వెళ్ళి చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే సోమశర్మ నోరు కట్టుబడిపోయింది. అతడు విజయవర్మవైపు బెదురుగా చూడసాగాడు. దీనికి కారణం విజయవర్మ గ్రహించక పోలేదు. అతని తండ్రిపేరే అభయవర్మ. అసలుసంగతి ఏమిటో ఎవరికీ తెలియదు. కాని, మొత్తానికి అతని తండ్రి చాలా ఏళ్ళ క్రితం గిరికోటలోనే హత్యచేయబడ్డాడు.

అప్పటిలో ఆ హత్యనుగురించి చాలా అలజడి బయలుదేరింది. కొంత విచారణ కూడా జరిగింది. కాని రోజులు మంచివి కాకపోవటంవల్ల, నేరం ఎలా జరిగిందో నిర్ధారణచెయ్యటానికీ, నేరస్థుణ్ణి పట్టుకొని దండించటానికీ వీలులేకపోయింది.

తరువాత సోమశర్మ రామసింగుతో కలిసి ఆలోచించి, జరిగిన విషయాలన్నీ విపులంగా ఒక ఉత్తరం రాసి విజయవర్మ చేతికి ఇచ్చాడు.

క్రొత్తగా తను ప్రోగుచేసిన సైనికులను వెంటబెట్టుకుని విజయవర్మను భీమవర్మ గారి వద్దకు వెళ్లమని ఆజ్ఞాపించాడు. చెప్పవలసిందంతా ఐనతరువాత విజయవర్మ ఉత్తరం మొలలో దోపుకొని తన దళంతో పాటు రామనగర్ బయలుదేరాడు.

(ఇంకా వుంది)






కిష్టన్న ఒక చిన్న బియ్యంమరకు యజమాని. అతని మర కృష్ణవొడ్డున వున్నది. మర చాలా చిన్నదైనా కిష్టన్న న్యాయమైన వాడని పేరు పడటంచేత, చిన్నచిన్న కాతాదారులూ, వ్యాపారులూ, ఎక్కువగా అతని వద్దకే వచ్చేవారు.

వడ్లు ఆడినందుకుగాను కిష్టన్న అందరిలాగా డబ్బులు గాక, తెచ్చిన ధాన్యంలో పదవవంతు తన కూలికింద తీసుకొనేవాడు.

అతని కాతాదారులలో ఐశ్వర్యవంతుడు ఒక్కడే ఉన్నాడు. పదిహేను రోజుల కొకసారి ధాన్యంబస్తాలు పంపుతూవుంటాడు.

ఒక రోజున ఆ శ్రీమంతునివద్దనుంచి కొన్నిబస్తాల ధాన్యం కిష్టన్న మిల్లుకు వచ్చినై. బస్తాలుతెచ్చిన నవుకరులు వాటిని అక్కడ పడవేసి వెంటనే వెళ్ళిపోయారు. వరసగా పేర్చివున్న ఆ బస్తాలు చూడగానే కిష్టన్నకు ఒక ఆలోచన కలిగింది:

'ఇప్పుడు పదిబస్తాలు వచ్చినై. ఇందులో నాకు కూలికింద ఒకబస్తా వస్తుంది. సరే. ఈబస్తా గాక, పైగా మరికొంచెం ధాన్యం నేను తీసుకుంటేనేం? తోడి మిల్లువాళ్ళందరూ చేసేపని యిదేకదా?'—అనుకుని, బస్తాధాన్యానికి పైగా మరికొంచెం తీసి, వేరే ఒకచోట దాచుకున్నాడు.

దాచుకున్నాడే గాని, అప్పటినుంచీ అతనికి మనస్సు సరిగాలేదు. అక్కడనే పక్కన ఒక పేదరాలు పెట్టిపోయిన ధాన్యపుబస్తా వుంది. అదిచూచి కిష్టన్న ఇలా అనుకున్నాడు:

'పోనీ, అందులో ఎక్కువధాన్యం తీస్తే తీశాను. ఫరవాలేదు. ఈ పేదరాలి బస్తాలో నా పదవవంతుకంటె తక్కువగా తీసుకుంటాను. ఆ పాపానికి ఈ పుణ్యానికీ సరిపోతుంది'. ఈవిధంగా సరిపెట్టుకున్నాడు కిష్టన్న. మళ్లా పదిహేను రోజులయేసరికల్లా

జి. వి. రమణ





నామీద అనుమానపడలేదు. ఇలా అను కోవటానికి కారణం ఆయన ఎప్పటిలాగా నెలకు రెండుసార్లూ ధాన్యం పంపిస్తూ వుండటమే. కనుక, చేసిన పొరపాటు దిద్దుకోవటానికని ఒక పనిచేస్తాను. నాకు కావలసిన పదవవంతు కూలీకంటె ఒక్కొక్కతడవ తక్కువగా తీసుకుంటూ వుంటాను. అలాఐతే, పట్టుబడటానికి అవకాశం ఉండదు' అనుకొన్నాడు.

అనుకొని, ప్రతితడవా తనకూలీ తక్కువగా తీసుకోవటం ప్రారంభించాడు. ఈ విధంగా, శ్రీమంతుని ఎదటికి వెళ్ళి ఏమీ చెప్పుకో నవసరం లేకుండా, కొద్దికాలం లోనే తను దొంగలించిన సొమ్ము తీర్చివేయ వచ్చునని తలిచాడు.

శ్రీమంతుని భార్య ఎప్పటికప్పుడు ధాన్యం కొలిపించే పంపించేది. మిల్లునుంచి వచ్చిన బియ్యంకూడా, వెంటనే కొలిపించి చూసుకునేది. ఎక్కువ తక్కువలు రావటం కనిపెట్టి, ఒకరోజున భర్తతో చెప్పిందామె. కాని, ఆయన నమ్మలేదు. ఏమీ?—కిష్టన్న తండ్రికాలంనాటినుంచీ ఆ మిల్లు అంటే ఎంతో నమ్మకం అతనికి. అందుచేత ఎంత మాత్రం అనుమానపడలేదు.

శ్రీమంతుడి ధాన్యపుబస్తాలు వచ్చినై. మునుపటిలాగానే యిప్పుడుకూడా కిష్టన్న పదవవంతుకంటె ఎక్కువే తీసుకుని, దాచుకొన్నాడు. కొంతకాలంపాటు ఇలాగే జరుగుతూవచ్చింది. శ్రీమంతుని ధాన్యం లోనించి తీసి దాచుకొన్న ధాన్యంపోగు ఎక్కువగుతున్నకొద్దీ, కిష్టన్నకు మన శ్శాంతి తగ్గుతూవచ్చింది.

ఆ శ్రీమంతుడి యెదటికి పోయి, తప్పు వప్పుకొని, క్షమాపణ కోరుకుందామా అని కూడా అప్పటప్పట అనిపించేది. ఇలా వుండగా, కిష్టన్నకు మెరపులాగా ఒక ఆలోచన తట్టింది—'ఇంతవరకూ శ్రీమంతుడు







ఐనా, మళ్లీ మళ్లీ చెబుతూనేవుం దామె. ఒకరోజున బియ్యం తక్కువకు బదులు ఎక్కువగా వచ్చిందని ఆమె చెప్పేసరికి, ఆయన నవ్వుతూ "నేను చెప్పానుకాదా, వాడెంతో మంచివాడనీ, నమ్మకమైన వాడనిన్నీ?" అన్నాడు.

ఈలోగా అక్కడ కిష్టన్న—తన యుక్తి తెలుసుకోలేకపోయారుకదా అనే తృప్తితో ఒకరోజున తనవంతు కూలీ తీసుకోవటం అసలే మానివేశాడు.

ఆరోజున శ్రీమంతుని భార్య,—బియ్యం ఎక్కువగా వచ్చాయని చెప్పింది భర్తతో.

మరునాడు ఉదయాన్నే శ్రీమంతుడు బండిమీద బయలుదేరి కిష్టన్న మిల్లుకు వెళ్లాడు. ఆయనను చూచి కిష్టన్న నిశ్చేష్టు డయ్యాడు.

"కిష్టన్నా!—మేం పంపే ధాన్యం ముందుగా కొలిచి చూసుకొంటున్నావా?" అని అడిగాడు శ్రీమంతుడు.

"చూస్తున్నానండి..." అన్నాడు కిష్టన్న, మెల్లిగా.

"మాకు బియ్యం ఎక్కువగా పంపిం స్తున్నావుటేమిటి? ఇలాఐతే నీకు—పాపం, నష్టం రాదుటయ్యా?" అన్నాడు, మళ్ళీ.

కిష్టన్నముఖం వెలవెలబోయింది.

"మీ నాయన కాలంలో ఎన్నడూ తేడా రాలేదు కిష్టన్నా!" అన్నాడు శ్రీమంతుడు.

కిష్టన్న ఆయన పాదాలమీద పడ్డాడు. బొటబొట కన్నీళ్ళు రాలినై. తన తంత్ర మంతా విప్పిచెప్పి, క్షమాపణ కోరుకొన్నాడు. "ఇది వెల్లడించవద్దని" బతిమలాడాడు.

శ్రీమంతుని హృదయం కరిగిపోయింది. కిష్టన్నకు అభయమిచ్చాడు. ఇంటికి వెళ్ళి భార్యతో 'కిష్టన్న తూనికరాళ్లు సవరించి వచ్చా. ఇటుపైన బియ్యం సరీగానే వస్తాయిలే' అన్నాడు. నాటినుంచీ మరెన్నడూ ఆమె భర్తతో నేరం చెప్పలేదు.



# సులువైన కసరత్తు



ఇంట్లోనే కసరత్తుచేయటానికి వీలున్నది. కొన్నిరకాల వ్యాయామాలకు పరికరాలతో పనిఉండదు. అలా పరికరాల అగత్యంలేని ఒక రకం కసరత్తుగురించి ఇక్కడ చెబుతా. ఈ కసరత్తు శరీరానికి బలం కలిగించటమే కాకుండా, నీ స్నేహితులకు వినోదాన్నికూడా కలిగిస్తుంది. ఇటువంటి ఆహ్లాదకరమైన కసరత్తు నీవూ చేయవచ్చు. చేసిచూడమని నీ స్నేహితులను ప్రోత్సహించనూవచ్చు.

సుమారు అడుగున్నర పొడవుగల కొంచెం లావుపాటి కర్ర ఒకటి (బొమ్మలో చూపినట్టుగా) చేతపుచ్చుకో. ఇది తిన్ననైన కర్రముక్కగానీ, రూళ్ళకర్రగానీ కావచ్చు.

నీ రెండుకాళ్ళూ సరిగా పెట్టు. చేతులు రెండూ నిటారుగా చాచి, సరీగా పటంలో చూపిన మోస్తరుగా కర్రముక్క పట్టుకో. ఇప్పుడు రెండుకాళ్లతో ఆ కర్రపైనుంచి దూకాలి. మొట్టమొదటే సరిగా దూకడం కష్టమైన పని. కనుక, ముందుగా పచ్చగడ్డిపైనగాని, మెత్తని తివాసీపైనగానీ సాధకంచేస్తే, దెబ్బతగిలినా బాధించదు.



2. ఇంకో మంచి కసరతుకూడా చెబుతా : అదే కర్రను ఇప్పుడు వీపువెనుక పెట్టుకో. రెండు చేతులూ కొంకెలాగా ఉంచి కర్ర చేతులకూ, వీపుకీ మధ్య ఇరుక్కొని ఉండేటట్టు చెయ్యి. (ప్రక్కన ఉన్న బొమ్మ చూడు.) ఇప్పుడు నిటారుగా నిలచి నడవటానికి ప్రయత్నించు. ఈ కసరతువల్ల నీకు తిన్నగా, ఠీవిగా నడవటం అలవాటు ఔతుంది. వంగి, ముసలివాళ్ళలా నడిచే అభ్యాసం ఉంటె అదీ వెంటనే పోతుంది.




అనగనగా ఒక తోట. అది దైత్యునిది. అందులో రోజూ పిల్లవాళ్లు ఆడుకొనేవాళ్లు. ఆ తోట ఫలవృక్షాలతోనూ, పూలమొక్కల తోనూ ఎంతో అందంగా వుండేది. చెట్లమీద పక్షులు మధురగానాలు చేస్తూండేవి. నేల మీద పచ్చిక దట్టంగా పెరిగి, మెత్తని తివాసీ పరిచినట్లు ఉండేది. ఆ తోటలో ఆడుకుని పిల్లలు ఎంతో ఆనందిస్తూ ఉండేవారు.

ఒకనాడు దైత్యుడు తిరిగివచ్చాడు. దూర దేశంలో వున్న స్నేహితుని ఇంట్లో ఏడేళ్లుండి, అతడు ఆనాడే తిరిగివచ్చాడు. పిల్లలు తన తోటలో ఆడుకోవటంచూసి దైత్యుడు కోపంతో "మీరంతా ఇక్కడ ఏం చేస్తున్నారు?" అని అరిచాడు. పిల్లలు భయపడి పారిపొయ్యారు.

ఇతరులు తన తోటలోకి రాకుండా చేయాలని దైత్యుడు నిశ్చయించుకున్నాడు. తోటచుట్టూ ఎత్తయిన గోడ ఒకటి కట్టించాడు; 'ఇతరులు లోనికి రాకూడదు' అని గుమ్మానికి ఒక బల్లకూడా కట్టాడు.

పిల్లలు ఆడుకొనేందుకా చోటులేదు. రోడ్డుమీద దుమ్ము, రాళ్లు ఉండేవి. పూర్వం తాము హాయిగా ఆడుకునే తోటను తలుచుకొని పిల్లలు ఎంతో విచారపడేవాళ్లు.

వసంతఋతువు వచ్చింది; దేశమంతటా రకరకాల చెట్లు పూవులు పూసినవి; పక్షులు కిలకిలలాడుతూ చెట్లను ఆశ్రయించినవి. కాని దైత్యుని తోటలోమాత్రం శీతాకాలం మారలేదు. పిల్లలు లేనందువల్ల పక్షులు పాటలు పాడదలచలేదు; చెట్లు పూలు పూయటమే మరిచిపోయినవి. ఒకసారి ఒక చిన్న గడ్డిపువ్వు తొంగిచూచిందికాని 'ఇతరులు లోనికి రాకూడదు' అనే బల్ల చూసి వెంటనే ముడుచుకొనిపోయింది.

మంచుకూ, చలికీ వాటికి ఎంతో సంతోషంగా వుంది. వాటిని తరిమేందుకు వసంతం

సి. జయలక్ష్మి




యీ తోటలో ప్రవేశించలేదు ; ఎన్నాళ్లయినా ఇక్కడే హాయిగావుండే అవకాశం వాటికి దొరికింది.

మంచుతో నేలంతా తెల్లబారింది ; చెట్లపై తెల్లని మంచు వేలాడసాగింది. ఉత్తరపు గాలిని ఆహ్వానించింది మంచు; ప్రతిరోజూ గాలి విపరీతంగా వీచటంవల్ల దైత్యుని ఇంటి పైభాగం చాలా దెబ్బతిన్నది ; ఇంటి లోని గాజుసామానూ, పింగాణీసామానూ చాలాభాగం పగిలిపోయింది.

'ఈసారి వసంతఋతువు ఆలస్యమయిందేం?' అని దైత్యుడు ఆశ్చర్యపడ్డాడు. ఒకనాటి ఉదయాన దైత్యుడు మేలుకునే సరికి మధురగానం వినపడింది. కమ్మని సువాసన వీచింది. చివరకు వసంతం వొచ్చిందేమోనని దైత్యుడు కిటికీలోనుంచి చూచాడు.

తాను కట్టిన ప్రహరీగోడలో ఒకపక్క చిన్న కంతచేసుకొని పిల్లలు తన తోటలోకి ప్రవేశించారు. ప్రతి చెట్టుమీదా ఒక బాలుడు వున్నాడు. ప్రతిచెట్టూ పూలతో యెంతో అందంగా వూగుతోంది. పచ్చని నేలమీద చిన్నచిన్న తెల్లని పూలు నవ్వుతున్నవి. పక్షులు మధురంగా పాడుతున్నవి. ఆ దృశ్యం నిజంగా కనులపండువుగా వుంది.

కాని ఒకమూల మాత్రం ఒక చిన్న పిల్లవాడు విచారంగా నిలబడి వున్నాడు. మరీ చిన్నవాడు కావటంవల్ల చెట్టు ఎక్కలేకపొయ్యాడు. అక్కడికి కుర్రాడు ఎక్కేటందుకు వీలుగా చెట్టు వంగింది ; ఐనా లాభం లేకపోయింది. చెట్టునిండా మంచు కమ్ముకున్నది.

ఈ దృశ్యం చూచేటప్పటికి దైత్యుని హృదయం కరిగిపోయింది. "ఇన్నాళ్ళూ నేను ఎంత స్వార్థంతో వున్నాను! అందుకనే వసంతఋతువు రాలేదు" అని తలిచి సిగ్గుపడ్డాడు.

మూలనువున్న ఆ చెట్టుదగ్గరికి చకచకా నడిచివెళ్ళాడు. దైత్యుడు తమవైపు రావటం చూసి పిల్లలందరూ భయపడి పరుగెత్తారు. కిలకిలలాడే పిల్లలు తనను చూచి పరుగెత్తటంవల్ల దైత్యునికి యెంతో విచారం కలిగింది. పిల్లలు వెళ్ళారంటే మళ్ళీ శీతకాలం తన తోటలో ప్రవేశిస్తుంది!

మూలనున్న చిన్నపిల్లాడి కళ్లు విచారంతో నీరుకారుతున్నవి; వాడికి దైత్యుడు రావటం కనిపించలేదు; అందుకనే వాడు పరుగెత్తలేదు. దైత్యుడు మెల్లిగా, మృదువుగా వానిని యెత్తి చెట్టుమీద కూర్చోపెట్టాడు. వెంటనే ఆ చెట్టు పూలు పూసింది; పక్షులు చెట్టుమీద వాలి పాడసాగినవి. చిన్నకుర్రాడు సంతోషంతో దైత్యుని మెడచుట్టూ చేతులు వేసి, అతనిని ఆప్యాయంతో ముద్దుపెట్టుకున్నాడు.

మిగతా పిల్లలు యీ దృశ్యం చూచి, దైత్యుడు మంచివాడేనని గ్రహించి, తోటలోకి వచ్చి ఆటలాడుకోసాగారు.

"ఈ తోట మీదే!" అన్నాడు దైత్యుడు. చుట్టూవున్న ప్రహరీగోడ పడగొట్టేశాడు. అప్పటినుంచి రోజూ అందమైన ఆ పిల్లలతో ఆటలు ఆడుకోసాగాడు.




సాయంత్రం ఇంటికి వెళ్లేటప్పుడు పిల్లలు దైత్యుడిదగ్గరకు వెళ్ళేవాళ్ళు.

ఒకరోజు "ఆరోజున నేను చెట్టుమీద కూర్చోపెట్టిన చిన్నపిల్లాడు ఎక్కడ?" అని దైత్యుడు వాళ్లను అడిగాడు.

"మాకు తెలియదు. అంతకుముందు వాణ్ణి మేమెక్కడా చూడలేదు" అని పిల్లవాళ్ళు చెప్పారు.

పిల్లలంటే దైత్యునికి ఎంత సంతోషమైనా, ఆనాటి చిన్నకుర్రాడు కనిపించనందుకు ఎంతో విచారంగా ఉండేది.

సంవత్సరాలు గడిచినవి. దైత్యునికి ముసలితనం వచ్చింది. పూర్వంమల్లే పిల్ల

లతో ఆడుకునే ఓపిక లేదు. అందుకనే వాళ్ళ ఆటలు చూస్తూ కూర్చునేవాడు. "తోటనిండా ఎన్నో రకాల అందమైన పూవులున్నవి; ఈ పిల్లలే ఆ అందమైన పూలు!" అని అనుకునేవాడు.

ఒక శీతాకాలంనాటి ఉదయం దైత్యుడు బద్ధకంగా నిద్రలేచాడు. ఇప్పుడు శీతాకాల మంటే దైత్యునికి కోపంలేదు. ఎందుకంటే యీ సమయంలోనే చెట్లు విశ్రాంతి తీసు కుంటవి; వసంతం రాగానే అవి తిరిగి పువ్వులు పూస్తవి.

తోటలో ఒకమూలనున్న చెట్టునిండా పూలు ఉన్నవి. ఆ చెట్టుకొమ్మలు బంగారు రంగు కలిగిఉన్నవి; దాని పండ్లు వెండి రంగులో ఉన్నవి. ఆ చెట్టుకిందనే ఆనాటి చిన్న పిల్లాడు నిలబడివున్నాడు.

దైత్యునికి ఎంతో సంతోషమైంది. గబ గబా ఆ చెట్టువైపు పరుగెత్తాడు. పిల్లవాణ్ణి సమీపించగానే దైత్యునికి ఎంతో కోపం వచ్చింది. ఆ కుర్రవాడి చేతులమీదా, కాళ్ళమీదా మేకులుకొట్టిన గుర్తులున్నవి. "నిన్ను గాయపరిచింది ఎవరు?" అని గర్జించాడు; "చెప్పు. వాళ్లను ఇప్పుడే చంపేస్తాను" అని ఉరిమాడు.

"ఈ గాయాలు ప్రేమగాయాలు" అన్నాడు కుర్రాడు.

దైత్యుడు భయపడ్డాడు; ఆ కుర్రవాడి ముందు భక్తితో మోకరిల్లి "నీవు ఎవరివి నాయనా?" అని అడిగాడు.

చిన్నవాడు చిరునవ్వుతో—"ఎవరినైతే నేం, ఈ ఒక్కరోజూ నీ తోటలో నన్ను ఆడుకోనీ. తరువాత నీవే నాతోటలోకి వద్దువు గాని; నాతోట స్వర్గంలో ఉంది"అన్నాడు.

ఆ సాయంత్రం పిల్లలు తోటలోకి ఆడు కునేందుకు వచ్చేటప్పటికి దైత్యుడు చెట్టు కింద చచ్చిపడివున్నాడు; అతని శరీరం పూలతో కప్పబడివుంది. ఆ పువ్వుల పరి మళం తోటఅంతటినీ అలముకుంది.





# చిత్రమైన సమస్య

కౌటిల్యనగరాన్ని ఖడ్గసేనుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతడు వీరశిఖామణి. అతని కత్తికీ, మాటకూకూడా ఈ లోకంలో ఎదురులేకపోయింది.

ఒకనాడు ఖడ్గసేనుడు కొలువులో వుండగా, ఆర్తనాదం చేస్తూవున్న ఒక స్త్రీ అతడి ఎదటకు వచ్చి నిలబడింది. ఖడ్గసేనుడు ఆ స్త్రీని ఓదార్చి, దుఃఖానికి కారణం ఏమిటి అని అడిగాడు.

అందుకామె 'నా పేరు చంద్రావతి. నా భర్తను కాలయక్షుడు అనేరాజు అన్యాయంగా బంధించి చెరసాలలో పడవేశాడు. సర్వశక్తులు గల ప్రభువు అని కదా నీకు బిరుదు. నాభర్త తిరిగి నాకు లభించేటట్టు చేయవలసింది' అని ప్రార్థించింది.

'కాలయక్షుడు అనేవాడుఒకడువున్నట్టే నేనుఎన్నడూవినలేదే!'అన్నాడుఖడ్గసేనుడు.

అప్పుడు ఆస్త్రీ విలపిస్తూనే—

"మహారాజా! మీరు కాలయక్షుడి పేరే వినలేదనడం ఆశ్చర్యంగా వుంది. మీ దేశపు సరిహద్దులకు మూడామడల అవతల అతడు పెద్దకోట కట్టుకుని, కంటపడిన ప్రతివాడినీ బంధించి నానాయాతనలూ పెడుతున్నాడు" అని చెప్పింది.

"సరే, వాడి పొగరు అణుస్తాను. నువ్వు మాత్రం నిశ్చింతగా వుండు. నీభర్తను రక్షించే బాధ్యత నాది" అంటూ ఆస్త్రీకి ఖడ్గసేనుడు వెంటనే అభయమిచ్చాడు.

ఖడ్గసేనుడు ఆమట్టున కొలువుచాలించి, ఒంటిపాటుగానే కాలయక్షుడి మీదకు కయ్యానికి బయలుదేరాడు.

అడవులూ, కొండలూ, నదులూ దాటి ఖడ్గసేనుడు కొన్నాళ్ళకల్లా కాలయక్షుడి కోట సమీపానికి చేరుకొన్నాడు. సైన్యం అదీ ఏమీ లేకుండా, స్వయంగానే కాలయక్షుణ్ణి ఓడించాలని ఖడ్గసేనుడి పట్టుదల.

· వై. రమణమూర్తి




కోట సమీపించాడు. ద్వారాలు బంధింప బడివున్నై. ద్వారాలను మూడుసార్లు గట్టిగా తన్ని—

"ఈ కోటకు రాజైన వాడెవడో బయటకు రావచ్చు. ఖడ్గసేనుడు బాహాబాహి యుద్ధానికి పిలుస్తున్నాడు" అన్నాడు.

వెంటనే కోట తలుపులు తెరుచుకున్నయి. వికృతాకారు డొకడు పొట్ట చెక్కలయ్యేలాగా నవ్వుతూ—

"ఓహో, నువ్వా ఖడ్గసేనుడివి? ఐతే నేనే కాలయకుణ్ణి! నాతో బాహాబాహి యుద్ధానికి వచ్చావా?" అన్నాడు. కాలయకుడి ప్రవర్తనా, అతడు మాటాడే తేలిక మాటలూ, ఖడ్గసేనుడికి విపరీతమైన కోపాన్ని తెప్పించినై. వెంటనే ఒరలోని కత్తిదూసి అతడిపైకి దూకాడు.

కాలయకుడు మళ్ళీ నవ్వాడు. "ఖడ్గసేనా! నీకత్తి నీ స్వాధీనంలో వుందనుకుంటున్నావేమో! నా కోటకు చుట్టూ ఆమడదూరంలో నా అనుమతి లేనిదే గాలి కూడా కదలదుసుమా" అన్నాడు.

ఖడ్గసేనుడు మండిపడి కత్తి ఎత్తబోయాడు. కాని అతని చెయ్యి అంగుళం ఎత్తుకూడా లేవలేదు. కత్తి అలా చేతిలో వేలాడుతూ వుండిపోయింది.

"నువ్వు ఎందుకువచ్చావో నాకుతెలుసు" అన్నాడు కాలయకుడు నవ్వుతూ. "నీశరణు వేడిన ఆ స్త్రీ భర్తను వదిలేస్తాను. కాని, అతడికి బదులుగా నిన్ను బంధిస్తా. సరేనా?" అన్నాడు, ఖడ్గసేనుణ్ణి సమీపిస్తూ.

నివ్వెరపోయాడు ఖడ్గసేనుడు. తన భుజబలం, పరాక్రమం ఎందుకూ పనికిరాకుండాపోయినందుకు చాలా విచారించాడు. అతడు ఆలోచిస్తూన్నంతలో కాలయకుడు మళ్ళీ యిలా అన్నాడు:

"ఖడ్గసేనా! నిన్ను బంధించడం నాకేమంత యిష్టంగా లేదు. నేను అడిగిన ఒక




ప్రశ్నకు సంవత్సరంలోపుగా నువ్వు సరైన జవాబు చెప్పగలిగితే నిన్ను క్షమించి వది లేస్తాను."

"ఏమిటా ప్రశ్న ?" అని అడిగాడు ఖడ్గసేనుడు, వేరే దారి తోచక.

"ప్రశ్న ఏమంత పెద్దదికాదు. కాని. జవాబే కష్టమైంది. ఐనా ఆ ప్రశ్న విను: 'అన్నిటికన్న స్త్రీ మిన్నగా కోరేది ఏమిటి?' ఒక సంవత్సరంలోపల నువ్వుతెలుసుకుని చెప్పాలి" అన్నాడు కాలయకుడు.

సరే అని బయలుదేరాడు ఖడ్గసేనుడు. రాజోచితమైన తన దుస్తుల్ని మూటకట్టి భుజానవేసుకుని ఒక సామాన్యపౌరుడుగా పట్టణాలూ, గ్రామాలూ తిరగసాగాడు.

కాలయకుడు తనను అడిగిన ప్రశ్న అనేకమంది స్త్రీలను అడిగాడు. 'అన్నిటి కన్న స్త్రీ మిన్నగా కోరేది యేమిటి?'— ఈ ప్రశ్నకు తల కొకవిధంగా జవాబు చెబుతూవచ్చారు.

'అందమైన భర్త' అని కొందరు, 'ధన వంతుడైన భర్త' అని కొందరూ అన్నారు. మరికొందరు 'బుద్ధిమంతుడైన భర్తను కోరుతుం' దన్నారు. ఈవిధంగా అందరూ అన్నిరకాల జవాబులు చెప్పారు.

ఇంతలో సంవత్సరం గడువు పూర్తి కావచ్చింది. కాలయకుడికి ఇచ్చిన మాట ప్రకారం, ఖడ్గసేనుడు తిరిగి అతడి కోటకు బయలుదేరాడు. కొన్నాళ్ళు ప్రయాణంచేసి, ఒకరాత్రి మళ్ళీ కోటప్రాంతాలకు వచ్చాడు.

ఖడ్గసేనుడు ఆరాత్రికి కోటపక్కనే వున్న అడవిలో కాలం గడిపి, తెల్లవారి కాలయకుణ్ణి కలుసుకోవచ్చుననుకుని ఒక చెట్టుక్రింద విశ్రమించాడు. బాగా నడిరాత్రి అయేసరికి దూరంలో చిన్న వెలుగు కనబడి, స్త్రీరోదనం వినబడింది.

ఖడ్గసేనుడు నిద్రమత్తులోంచి బయట పడి, ఆ స్త్రీ కంఠస్వరం వినబడిన చోటుకు




వెళ్ళాడు. వికృతాకారి ఐన ఒక వృద్ధస్త్రీ అతడి కంటపడింది.

"ఇంత రాత్రివేళ ఎందుకు దుఃఖిస్తున్నావు?" అని అడిగాడు ఖడ్గసేనుడు.

"నాకు ఇప్పుడు ఎనభై ఏళ్ళ వయస్సు. నన్ను వివాహం చేసుకునేవాడెవడూ దొరక్క అరవై యేళ్లనుంచి ఇలా దుఃఖిస్తున్నాను" అన్నది ఏడుస్తూ ఆమె.

ఖడ్గసేనుడు ఈ మాటలువిని చాలా ఆశ్చర్యపడ్డాడు. యింత వికృతంగా వున్న వృద్ధురాలికి వివాహంమీద అంత కాంక్ష ఏమిటా అనుకొన్నాడు. అతడి నోటినుంచి మాట రావడమే కష్టమైంది.

అతడి ఆశ్చర్యకారణాన్ని గ్రహించిన ఆ వృద్ధస్త్రీ యిలా చెప్పసాగింది:

"ఖడ్గసేనమహారాజా! మీరు యిప్పుడు చాలా ప్రాణాపాయస్థితిలో వున్నారు. మీరు కాలయక్షుడి ప్రశ్నకు సరైన జవాబు తెలుసుకోలేకపోయారు. ఆ ప్రశ్నకు సరైన జవాబు నాకొక్కర్తెకే తెలుసు."

"ఐతే ఆ జవాబు చెప్పి పుణ్యంకట్టుకో! నీవు ఏది కోరినా యిస్తాను. మాట తప్పను" అన్నాడు ఖడ్గసేనుడు.

"సరే, మాటతప్పనన్నావు కనుక చెపుతున్నాను. కాలయక్షుడి ప్రశ్నకు జవాబిది. 'స్త్రీ అన్నిటికన్న మిన్నగా కోరేదిఏమిటంటే: తన యిష్టానికి ఎవరూ అడ్డు చెప్పక పోవటమే" అన్నది ఆ వృద్ధ స్త్రీ.

సరేనని ఖడ్గసేనుడు వుదయమే కాలయక్షుడివద్దకు వెళ్ళి ఈజవాబు చెప్పాడు. జవాబు వింటూనే కాలయక్షుడు ఆశ్చర్యపడి, ఖడ్గసేనుని తెలివితేటలను మెచ్చుకుని, అతణ్ణి వదిలేశాడు.

బ్రతుకు జీవుడా అనుకుంటూ ఖడ్గసేనుడు తిరుగా ఆ వికృతరూపి అయిన వృద్ధస్త్రీ దగ్గరకు వచ్చి, 'నీకు ఏమికావాలి కోరుకో!' అన్నాడు.

వృద్ధస్త్రీ నవ్వింది. తనకు కావల సిందేమిటో ఇప్పటికీ ఖడ్గసేనుడు గ్రహించ లేకపోయినందుకు ఆమె ఎంతో ఆశ్చర్య పడింది.

"మహారాజా! నాకు మాటయిచ్చారు. ఇదుగో నాకు కావలసిందేమిటో చెపు తున్నాను. అరవైఏళ్లనుంచి నన్ను వివాహం ఆడేవానికోసం ఎదురు చూస్తున్నాను. నేటికి మీరు కనిపించారు. నాపైన కరుణిం చారు. మీ ఆస్థానంలో ఏవీరుడినైనా చూచి నాకు పెళ్ళిచేసి చిరకాలంనుంచి ఉండి వున్న నాకోర్కె నెరవేర్చండి" అన్నది.

ఖడ్గసేనుడి నెత్తిన పిడుగుపడ్డట్టయింది. చూస్తూచూస్తూ ఈ వృద్ధ కురూపిని తన ఆస్థానంలో ఏ యువకవీరుడు మాత్రం చేసుకోవటానికి యిష్టపడతాడు? ఐనా, వాగ్దానం చెల్లించాలికదా!

ఆమెను వెంటబెట్టుకుని తిరిగి కౌటిల్య నగరానికి వచ్చాడు. చాలా కాలానికి మళ్ళీ తిరిగివచ్చిన మహారాజుకు రాజ్యంలో గొప్ప సన్మానం జరిగింది. కాని ఖడ్గసేనుడికి మట్టుకి దిగులుపట్టుకుంది.

అతడు అన్నాహారాలు మాని రోజు రోజుకూ కృశింపసాగాడు. ఎవరెన్నివిధాల




అడిగినా అసలు కారణం బయటపెట్టలేదు. చివరకు ఒకనాడు తన మేనల్లుడైన రూప ధరుడికి వెల్లడించాడు.

మామగారి బాధకు కారణం గ్రహించ గానే, రూపధరుడు ఆ కురూపిఅయిన వృద్ధ స్త్రీని తనే వివాహమాడతానని సిద్ధపడ్డాడు.

రూపధరుడికీ ఆ వృద్ధస్త్రీకీ వివాహం జరిగిపోయింది. అందరూ లోలోపల ఏమను కున్నా, రాజకుటుంబానికి సంబంధించిన విషయం గనుక ఆ కురూపిని గౌరవించక తప్పిందికాదు.

చక్కగా అలంకరింపబడిన గదిలో పెండ్లికుమార్తె ఉన్నది. రూపధరుడు అక్క

డికి వెళ్ళాడు. ఆశ్చర్యం!—అక్కడ అతడి కంటికి కనబడిన స్త్రీ మూర్తి వృద్ధురాలు కాదు. ఒక చక్కని యువతి, అపరూప సౌందర్యవతి. రూపధరుడు నివ్వెరపడి—

"నువ్వెవరవు ?" అని ప్రశ్నించాడు.

"నేనా ? రూపధరుని భార్యను. కొంత శాపం విముక్తిచెందిన ఆ వృద్ధస్త్రీని నేనే !" అని నిజం వెల్లడించింది.

ఇందుకు అతను మరీఆశ్చర్యపోయాడు. "సుందరీ ! నీకు కలిగిన శాపం ఏమిటి ? అది తొలగే మార్గమేమిటి ?" అని ఆత్రంతో అడిగేసరికి, ఆమె ఇలా బదులు చెప్పింది :

"రాజకుమారా ! కురూపినని ఎంత మాత్రమూ సంశయించక, మీ మాట నిలబెట్టటంకోసమని నన్ను నీవు పెళ్ళాడటానికి అంగీకరించటంతో నాకు సగంశాపం పోయింది. ఇక తక్కిన సగమూ, అనగా పూర్తిశాపం పోవటానికి నిన్ను నేనొక ప్రశ్న వేస్తాను. నాకు శాపవిముక్తి కావటం నీవు చెప్పే జవాబు మీద ఆధారపడి వుంటుంది" అన్నది.

ఆ ప్రశ్న యేమిటో చెప్పమని రూపధరుడు ఆమెను తొందరపెట్టాడు.

అప్పుడామె "ఈసుందర రూపంలో నేను రోజూ కొన్నిగంటలు మాత్రమే కనిపించగలను. కనుక, ఆలోచించి చెప్పాలి— నేను ఏయేవేళల ఈ రూపం ధరించాలి ?" అని అడిగింది.

తడుముకోకుండా రూపధరుడు 'నీఇష్టమే నాయిష్టం' అన్నాడు.

ఈజవాబు వినగానే ఆయువతిరూపంలో వున్న వృద్ధస్త్రీకి పట్టలేనంత సంతోషం కలిగింది. వెంటనే రూపధరుని సమీపిస్తూ—

"నాకు మీరు ఏ అడ్డంకీ చెప్పకుండా, సమస్యను నా ఇష్టానికే వదిలేశారు కనక ఇప్పటికి నాశాపం పూర్తిగా నివృత్తిఅయింది. నేనిక అన్నివేళలా ఈస్వరూపంలోనే వుండిపోగలను" అని చెప్పింది.





# ఒకరినిమించి ఒకరు

పూర్వం మన దేశంలో ఒక గొప్ప శిల్పి ఉండేవాడు. ఆ కాలంలో కర్కాల్ అనే ప్రాంతాన్ని పరిపాలిస్తూన్నరాజుకి విగ్రహాలు చెక్కించటం అంటె అభిలాష. ఆయన ఆ శిల్పిని రప్పించి, ఇరవైయైదు అడుగుల ఎత్తుగల పరమేశ్వరుని విగ్రహం తయారు చేయుమన్నాడు.

అందుకు ఆ శిల్పి, "ఓ, అదెంత పని? చెక్కియిస్తాను' అనిచెప్పి, మూడు మాసాలయేసరికి రాజు కోరిన గొప్ప విగ్రహం తయారుచేసి ఇచ్చాడు. విగ్రహన్ని చూసి రాజు మురిసిపోయాడు. అంత ఎత్తైన విగ్రహం మన దేశంలో అంతవరకు లేనే లేదు. దేశదేశాలనుంచి వచ్చినవాళ్లంతా ఆ విగ్రహన్ని చూసి మెచ్చుకోవడంవల్ల ఆ రాజు ఖ్యాతి దశదిశలా ఇట్టే వ్యాపించింది.

శిల్పికి గొప్ప గొప్ప బహుమతు లిచ్చి పంపేడు రాజు. శిల్పి బహుమానా లందుకుని తన వూరు పోతూంటే రాజుకు ఒక భయంవేసింది.

ఈ శిల్పినే మరొక మహారాజు ఎవడైనా పిలిపించి, ఇంతకన్నా ఎక్కువ బహుమానం ఇచ్చి, ఇంతకన్నా గొప్ప విగ్రహన్ని తయారుచేయించుకుంటాడేమో! అప్పుడా విగ్రహంముందు తన బొమ్మ తక్కువయిపోయి, తన కీర్తి తరిగిపోతుందేమో! అని. ఇంక బొమ్మలుచెక్కడం సాధ్యంకాకుండా వాని కుడిచెయ్యి నరికించి వదిలాడు.

శిల్పి స్వగ్రామం చేరుకుని తనకు రాజు చేసిన ద్రోహన్ని తలుచుకొని దుఃఖిస్తూ, ఆ రాజుపైన ఎలా కసి తీర్చుకోవటమా అని ఆలోచించాడు.

ఈ రాజుకి బద్ధశత్రువైన వేనూరిరాజు వద్దకు వెళ్లి తన గోడు చెప్పుకొన్నాడు.

'ప్రభూ, ఒక్క చెయ్యి పోయినంత మాత్రాన నా నేర్పు నశిస్తుందనుకోవడ

సి. జయలక్ష్మి



మేమిటి ఆ రాజు?' అని ఆ శిల్పి తన ఎడం చేతితో మీసం మెలిపెట్టేడు.

ఇందుకు వేనూరురాజు ఆశ్చర్యపోయి, 'అలాగైతే, నీ కుడిచెయ్యి పోయినా నేర్పు నశించలేదన్నమాట!' అన్నాడు.

'ఎడంచెయ్యి ఉందిగా ప్రభూ? సవ్యసాచి రెండుచేతులా బాణాలు వేసినట్టు నేను రెండుచేతులతోనూ విగ్రహాలు చెక్కగలను!' అన్నాడు.

'అలాగైతే నాకొక విగ్రహం తయారు చెయ్యి. కర్కల్ విగ్రహంకన్న చాలా ఎత్తైన విగ్రహం తయారుచెయ్యాలిసుమా' అని ప్రోత్సహించాడు రాజు.

'తప్పకుండా అలాగే చేస్తాను. ముప్పై ఆరు అడుగుల ఎత్తున విగ్రహం తయారు చేసియిస్తాను!' అన్నాడు శిల్పి.

శిల్పి కర్కలురాజుపైన పూనిన పగ కొద్దీ రాత్రింబగళ్ళు పనిచేసి అనుకున్న దానికంటె త్వరలోనే ఆ ముప్పైఆరడుగుల విగ్రహాన్ని తయారుచేసి ఇచ్చాడు. వేనూరు రాజు బ్రహ్మానందభరితుడయాడు.

కాని, ఇంతకుముందు కర్కలురాజుకి పట్టుకున్న భయమే ఇప్పుడు ఈ రాజుకీ పట్టుకుంది. శిల్పిని వదిలిపెడితే అంతకన్నా గొప్ప విగ్రహం తయారుచెయ్యవచ్చు. అప్పుడు తన విగ్రహం గొప్పయేముంటుం దింక?

కర్కలురాజుకి తోచిన ఉపాయమే వేనూరు రాజుకీ తోచింది. ఆ శిల్పి తన ఎడంచెయ్యి సహాయంవల్లకద ప్రజ్ఞచూపించగలిగాడు? అనితలిచి అతని ఎడంచెయ్యి కాస్తా నరికించివేశాడు.

'ఐతేయేమి, చింత చచ్చినా పులుపు చావలేద'న్నట్లు రెండు చేతులూ పోగొట్టుకున్నా, శిల్పికి పగ పోలేదు.

అతడు తక్షణమే మైసూరుకు పారిపోయి, శ్రవణబెల్గోలా రాజుతో 'ప్రభూ, చిత్తగించారా నాపట్ల ఆ రాజులిద్దరూ




చూపిన కృతఘ్నత?' అని చెప్పుకొన్నాడు. అలా చెప్పుకోవటంతో • అతనికి ఆవేశం ఆగలేదు. ఉగ్రుడయ్యాడు శిల్పి. నిప్పులు చెరిగేస్తూ ఇలా అన్నాడు :

'ప్రభూ, ఇద్దరూ నా చేతులు నరికించారుగాని నా బుద్ధిని హరించటం వాళ్ల తరమవుతుందా, వాళ్ళను పుట్టించిన బ్రహ్మ తరమవుతుందా?' అన్నాడు.

'అయితే నువ్వు చేతులు లేకుండానే విగ్రహాలు తయారుచేయగలవా?' అని అత్యంత ఆశ్చర్యంతో అడిగాడు రాజు.

'తప్పకుండా చెయ్యగలను. నాబుద్ధిని వినియోగించి నా శిష్యులచేత తమకొక అపూర్వమైన విగ్రహాన్ని తయారుచేయిస్తాను!' అని చెప్పాడు శిల్పి.

'చేయించు' మన్నాడు రాజు.

శిల్పి ఒక ఆసనం అధిష్ఠించి కూర్చున్నాడు. శిష్యులకు ఆజ్ఞలిస్తూ, ఏభైయేడు అడుగుల ఎత్తుగల గోమతేశ్వరుని విగ్రహాన్ని తయారుచేయించాడు. ఆ శిల్పి యాజమాన్యంక్రింద చెక్కబడ్డ బ్రహ్మాండమైన విగ్రహం అదే. అతను తయారుచేసిన ఆఖరి విగ్రహమూ అదే!

ఏమంటే కర్కలురాజుకీ, వేనూరు రాజుకీ పుట్టిన దుర్బుద్ధే ఈ శ్రవణబెల్గోలా రాజుకీ పుట్టింది. 'అతనికంటే, ఘనుడు ఆచంట మల్లన్న' అన్నట్లు, అతని ప్రతిభ మరి ఏ ప్రభువుకూ వినియోగించటానికి వీలుకాకుండా ఈ రాజు శిల్పియొక్క శిరస్సునే నరికించివేశాడు!

శిల్పిని చంపించిన రాజులు ముగ్గురూ చచ్చి చాలాకాలమైంది. కాని ఆ మహాశిల్పి కీర్తిని చాటే విగ్రహాలుమట్టుకి నేటికీ శాశ్వతంగా నిలిచిఉన్నాయి.

ఈవిధంగా, ఆశిల్పికి అనేకమైన ప్రజ్ఞలు ఉన్నప్పటికీ, అతనికి జీవితంలో తోడ్పడలేదు సరికదా, చివరకు అతని ప్రాణాలనే బలిగొన్నాయి.




# దేవదారువు

మహాప్రళయానికి తరువాత శ్రీ మహావిష్ణువు తిరిగి సృష్టికి పూనుకొన్నాడు.

కొంతవరకు సృష్టి సాగినతరువాత శ్రీ మహావిష్ణువుకు బడలిక కలిగింది. కొద్దికాలం విశ్రమించి నిద్రపోదామనుకున్నాడు. కాని తాను తిరిగి మేలుకొనేదాకా ఈ సృష్టిని ఎవరు కాపాడేటట్టు? జంతువులూ మానవులూ యింకా సృష్టి కానేలేదే?

అందుచేత శ్రీ మహావిష్ణువు తాను సృష్టించిన చెట్లనన్నిటినీ పిలిచి, "నేను విశ్రమించి లేచేవరకూ ఈసృష్టిని భద్రంగా చూసే భారం మీది" అని చెప్పి చెట్లన్నిటినీ వేరువేరుగా కొండలమీదికీ, లోయలలోకీ, మైదానాలమీదికీ పంపేసి, తాను పడుకుని నిద్రపోయినాడు.

వేపచెట్టూ, బాదంచెట్టూ, తుమ్మచెట్టూ, జువ్విచెట్టూ, మర్రిచెట్టూ మొదలైన అనేక చెట్లు మైదానాలమీదికి వెళ్ళాయి. టేకుచెట్టూ, వెదురుచెట్టూ మొదలైనవి లోయలలోకి వెళ్లాయి. దేవదారువు ఎత్తయిన పర్వత శిఖరాలమీదికి పోయింది. అన్ని చెట్లూ శ్రీ మహావిష్ణువు ఆదేశానుసారం తమతమ స్థలాలలో నిటారుగా నిలబడి సృష్టికి కాపలా కాయసాగినై. కొంతకాలం గడిచేసరికి చెట్లలో కొన్నిటికి బడలిక వచ్చేసింది. అవి కొమ్మలువాల్చి కునకసాగాయి.

ఆర్. వీరభద్రం



మరికొంతకాలం గడిచింది. నిద్రముంచుక రావటంవల్ల మరికొన్ని చెట్లు జోగసాగాయి.

ఇంకా కొంతకాలం గడిచింది. మిగిలిన చెట్లకుకూడా నీరసం వచ్చేసింది. అవికూడా నిద్రపోయాయి.

కాలక్రమాన శ్రీమహావిష్ణువు నిద్రనుండి లేచాడు. చెట్లుఅన్నీ గాఢనిద్రలో ఉన్నాయి. ఆయనకు కోపంవచ్చింది. "ఏమిటీ, ఈ చెట్ల పొగరు? నాఆజ్ఞను ఉల్లంఘించి, నాతోపాటే నిద్రపోతాయా ?" అన్నాడు. "స్వామీ !"

శ్రీమహావిష్ణువు ఆశ్చర్యపడి తలయెత్తి చూశాడు. కొండ శిఖరంమీద నిలబడివున్న దేవదారువు పలికింది :

"స్వామీ, నేను నిద్రపోలేదు. మీసృష్టిని వెయ్యికళ్లతో కనిపెడుతున్నాను."

దారువును చూసి శ్రీమహావిష్ణువు చాలా ప్రీతిచెంది, దానికి 'దేవదారువు' అన్నపేరు ఇచ్చాడు. అన్ని ఋతువులలోనూ అది పచ్చ పచ్చగా వుండేటట్టుకూడా దానికి వరం అనుగ్రహించాడు.



# ఇది చేయటం నీవల్ల అవుతుందా?



రెండు గాజుగళాసులు, కొంచెం నీళ్ళు, ఒక సన్నటి రబ్బరుగొట్టమూ తీసుకురా. మేజాపైన కొన్ని పుస్తకాలు ఎత్తుగా పేర్చి, వాటిమీద ఒక గళాసులో నీళ్ళు ఉంచు. ఖాళీగళాసు ఆ దగ్గర లోనే కిందని పెట్టు.

రబ్బరుగొట్టం తీసుకొని, దాని ఒకకొసను ఎత్తున ఉండే గళాసులో, నీళ్ళలో బాగా మునిగి వుండేట్టు పడవెయ్యి. రెండవ కొస నీ నోటిలో పెట్టుకొని, నీళ్ళు వచ్చేదాకా లోపలికి పీల్చు.

గొట్టంనిండా నీళ్ళురాగానే, నీ నోటలోవుండే కొసను వేళ్ళతో గట్టిగా అదిమి పట్టి, రెండవకొసని జాగ్రత్తగా దిగువనుండే ఖాళీగళాసులోకి వదిలిపెట్టు. పైన గళాసునీళ్ళలో వున్న కొసనిమట్టుకు ఏమీ కదపకు. మరొక విశేషం ఏమిటంటే; రబ్బరుగొట్టం కొస పైగళాసులో పెద్దదిగా ఉండాలి.

ఇప్పుడు నీవు అదిమిపట్టిన గొట్టపు రెండవకొసను మెల్లగా వదిలెయ్యి. చూస్తే—నీవు పీల్చక్కరలేకుండానే పైగళాసులో ఉండే నీళ్ళు అన్నీ పూర్తిగా, రబ్బరు గొట్టంద్వారా కిందనున్న ఖాళీ గళాసులోకి వాటంతటవే వచ్చేస్తాయి.

మేజామీద ఒక చిన్న పళ్ళెం ఉంచు. పళ్ళెంమధ్యని ఒక నాణెం పెట్టు. (2-వ బొమ్మచూడు) కాని చూసేవాళ్లకు నాణెం కనిపించదు. (3-వ బొమ్మలో ఉన్నట్టు). ఇప్పుడు నీ స్నేహితుణ్ణి పిలిచి, కొంచెం కిందికి—అనగా నాణెం కనిపించకుండా ఉండేటట్టుగా—కూర్చోమను (4-వ బొమ్మలో మోస్తరు) అతను అలానే కూర్చునివుంటే పళ్ళెంలో నిదానంగా నీళ్లుపోయటానికి ప్రారంభించు. పళ్ళెంమీద నున్న నాణెం పైకి లేచినట్టుగా అతనికి కనిపిస్తుంది. నిజానికి, నాణెం ఎక్కడపెట్టింది అక్కడనే వుందికాని, కదలనేలేదు. కాని, అతనికంటికి అలా కనిపిస్తుంది.






# ధర్మయుద్ధం

విక్రమదేవుడు అలకాపురి రాజ్యానికి ప్రభువు. ఆయన సేనానాయకులలో కంఠీరవుడు ఘనుడు. ఒక విజయదశమి నాడు రాజూ, సేనానాయకులూ, పరివారమూ అంతా వెన్నెట్లో కూర్చుని వుబుసులాడు కొంటున్నారు.

అప్పుడు ఒక విచిత్రమైన వ్యక్తి గుర్రం మీద వచ్చి దిగాడు. అతనిని చూస్తూనే పరివారంలో ఒకడు "ఎవరు నీవు? మిత్రుడివా, శత్రువువా?" అని అడిగాడు.

ఆ వ్యక్తి 'శత్రువునూ కాదు, మిత్రుణ్ణి కామూ; నేనొక యోధుణ్ని' అన్నాడు.

"ఐతే, నీకేం కావాలి?" అని కోపంగా చూశాడు, విక్రమదేవుడు.

"యోధుడికి కావాలిసిందేమిటి, బలాబలాలు చూచుకోవటమేగా?" అని ఎదురు ప్రశ్న వేశాడు ఆ వ్యక్తి, నవ్వుతూ. ఈమాటకు అందరూ అతనికేసి చూశారు. అతను అజానుబాహువు. నల్లటి గెడ్డం. చేతిలో తళతళ మెరిసే గండ్రగొడ్డలి!—ఈ వేషం చూచి అందరకూ భయం కలిగింది.

"సరి, నీతో యుద్ధంచేయటానికి మా సేనాని కంఠీరవుడు..." అని రాజు అనేసరికల్లా, కంఠీరవుడు లేచి నిలబడ్డాడు.

అప్పుడు యోధుడు నవ్వుతూ "నేను యుద్ధంకోసమని రాలేదు. ఇదుగో— ఈ గండ్రగొడ్డలి చూశారుకద! మీలో ఎవరైనా సరే, దీనితో నా కంఠంమీద ఒక్క దెబ్బ వేయండి. ఒక్కటే దెబ్బ! ఈ దెబ్బకు గాను నన్ను కొట్టిన యోధుడు, వచ్చేయేడు మళ్ళీ ఇదే పండగరోజున, నావద్దకు వచ్చి ఇదే గండ్రగొడ్డలితో మెడమీద ఒక్క దెబ్బ తినాలి" అన్నాడు.

చిత్రమైన ఈకోరిక వినగానే అందరూ పకపక నవ్వారు. పదునైన ఆ గండ్రగొడ్డలితో కంఠంమీద దెబ్బతిని, ఇంకా బతికి

పి. యమునాబాయి




వుండడమా? ఈ దెబ్బకు మళ్ళీ సంవత్సరం గడిచాక బదులు దెబ్బ తీయడమా !

అందరూ విస్తుపోయి చూస్తూవున్నారు. యోధుడు తయారుగావున్నాడు. కంఠీరవుడు యోధుని చేతిలోని గండ్రగొడ్డలి తీసుకొని, రెండుచేతులతో బలంగా కంఠంమీద ఒక్క వేటు వేశాడు.

ఆశ్చర్యం!— గండ్రగొడ్డలి కంఠంలో సగంవరకు దిగింది. కాని ఒక్క నెత్తురు బొట్టు అయినా కింద రాలలేదు. యోధుడు నిలబడేవున్నాడు !!

గొడ్డలి లాగేసి, మెడ తడుముకున్నాడు. అంతే. అతనికి ఏమీజరగనట్టు అనిపించింది.

ఎప్పటిలాగా అతను నవ్వుతూ, కంఠీరవుడికేసి చూచి, "ఓయీ !–మాటతప్పక నీవు, సరిగా మళ్ళీ ఈరోజునాటికి, నేనుండే ఫలానా గిరిదుర్గానికి వచ్చెయ్యి" అంటూ, గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడు. అందరూ నిర్ఘాంతపోయారు.

* * *

ఏడాది ఇట్టె గడిచిపోయింది. చూస్తూ వుండగానే విజయదశమి దగ్గరపడింది. ఆ యోధుని మహిమనుగురించి రాజుగాని, మంత్రిగాని ఏమీ నిర్ధారణ చేయలేక పోయారు. ఏమైనా కానీ, మాట నిలుపుకోవాలంటే కంఠీరవుడు గిరిదుర్గం వెళ్ళితీరవలిసిందే. ఆ యోధుడు దెబ్బతీసుకోటానికి అవకాశం ఈయవలిసిందే. మాటనిలుపుకోకుంటే రాజుకీ రాజ్యానికీకూడా కళంకం. కనుక బాగా ఆలోచించి, విక్రమదేవుడూ, పరివారమూ కంఠీరవుణ్ణి సాగనంపారు.

సాగనంపారేకాని, తమ సేనాని మళ్ళీ తిరిగివస్తాడనే నమ్మకం ఎవళ్ళకూ లేదు. అటువంటి ఘనుడు తమకు లేకుండా పోతున్నాడే అని వారెంతో విచారించారు.

కంఠీరవుడు సంతోషంతో బయలుదేరి, రాత్రింబగళ్ళు అరణ్యాలలో ప్రయాణం

చేస్తూ పోయాడు. అలసిపోవటంచేత, గుర్రందిగి, బడలిక తీర్చుకొందామని ఒక చెట్టుకింద కూర్చున్నాడు.

అంతలోనే, ఒక ఆర్తనాదం అతనికి వినిపించింది. గప్పున లేచి, ఏమిటా అని పోయి చూడగా—దొంగలబారిని పడిన ఒక రాజపుత్రిక ఆమె. కంఠీరవుడు ఖడ్గం దూసేసరికి దొంగలగుంపు చెల్లాచెదురైపోయింది.

రాజపుత్రికి కట్టివున్న కట్లు అన్నీ విప్పి కుశలప్రశ్నలు వేసి, ఆమె సమాచారాలన్నీ తెలుసుకొన్నాడు కంఠీరవుడు. ఇటువంటి ఆపదనుండి తనను రక్షించినందుకుగాను ఆ రాజపుత్రి ఒక మహిమగల ఉంగరం అతనికి బహుమతి యిస్తూ "ఈ వుంగరం ధరించండి. ఇది దగ్గరఉంటే ఎటువంటి శక్తివంతమైన ఆయుధాలైనా మీకు హాని చేయలేవు" అని చెప్పింది.

కంఠీరవుడు వుంగరాన్ని తీసుకోలేదు. "అనాడు నేను యోధుణ్ని పదునైన గండ్రగొడ్డలితో కంఠంమీద దెబ్బకొట్టాను. అదే విధంగా నేను అతనివల్ల మళ్ళా బదులు దెబ్బతినటమే ధర్మం. మహిమగల వుంగరాన్ని మాటుపెట్టుకుని నేను వెళ్లటం కేవలం అధర్మం. వీరుడనైన నేను అటు




వంటి పనికి అంగీకరించలేను," అని సమాధానం చెప్పి, మళ్లీ చెట్టుకిందకు చేరుకొన్నాడు.

మరికొంతసేపైన తరువాత దగ్గరవున్న నదికి స్నానానికని వెళ్ళాడు కంఠీరవుడు. అతడు వెళ్ళగా చూచి రాజకుమార్తెకూడా ఆ చెట్టుకిందకు వెళ్లింది. అతడు తిరుగా వచ్చేసరికి ఆమె అదృశ్యమైంది.

కంఠీరవుడు గిరిదుర్గం చేరుకొనేటప్పటికి యోధుడు గండ్రగొడ్డలితో సిద్ధంగావున్నాడు. "మాట తప్పని నిన్నుచూస్తే నాకు చాలా సంతోషంగా వుంది" అని కంఠీరవుణ్ణి ఎంతగానో మెచ్చుకొన్నాడు.

కంఠీరవుడు తయారుగా నిలబడి, "మిత్రమా! బదులుదెబ్బ తీసుకో" అన్నాడు సంతోషంతోనూ, ధైర్యంతోనూ. "ఒక్క దెబ్బమాత్రమే సుమా!" అని హెచ్చరికకూడా చేశాడు.

ఈ హెచ్చరిక విని యోధుడు పకపక నవ్వాడు. "ఒక్క దెబ్బ!—ఈ దెబ్బకు తట్టుకొని బయటపడగలననుకొంటున్నాడు కాబోలు, అమాయకుడు!!" అనుకొన్నాడు తనలో. తళతళ మెరిసే తన గండ్రగొడ్డలితో బలంకొద్దీ ఒక్క వేటువేశాడు, కంఠీరవుని కంఠంమీద.

ఆశ్చర్యం!—గండ్రగొడ్డలి కంఠంలో సగంవరకు దిగింది. కాని, ఒక్క నెత్తురు బొట్టయినా కింద రాలలేదు. కంఠీరవుడు తొణకకుండా అలా నిలబడే వున్నాడు!! యోధునితోపాటు కంఠీరవునికీ అపరిమితమైన ఆశ్చర్యం కలిగింది. కంఠీరవుడు ఆ గొడ్డలిని ఇవతలకు లాగేసి, ఒక్కసారి మెడ తడివిచూచుకొంటే, అతనికి ఏమీ జరగనట్టే అనిపించింది.

యోధుడు నిర్ఘాంతపోయాడు! కోపం పట్టలేక, "మోసం! మోసం!!" అంటూ మళ్ళీ గొడ్డలిని ఎత్తబోయాడు. కంఠీరవుడు ఉగ్రుడై ఖడ్గం దూశాడు.

అంతలో గిరిదుర్గ మహారాజూ, రాజపుత్రికా అక్కడికి వచ్చి, వారిని ఆపుచేశారు. తనకు ఉపకారంచేసిన కంఠీరవునికి తెలియకుండానే, అతని కవచంలో మహిమగల తన ఉంగరం దాచిన సంగతి రాజపుత్రి తండ్రికి తెలియజెప్పింది.

నిజం తెలియగానే, ఎవరి ధర్మం వారు నెరవేర్చుకొన్నందుకు కంఠీరవునీ, రాజపుత్రినీ మెచ్చుకున్నాడు, యోధుడు. తరువాత—కంఠీరవుని ధర్మబుద్ధికీ ధైర్యానికీ సంతోషించి, రాజు అతనికి తన కూతురునిచ్చి వైభవంగా వివాహంచేశాడు. ఇందుకు యోధుడుకూడా దంపతులను దీవించాడు.



# చెట్టు పైకి పెరుగుతుంది - ఎందుకు ?

ఈ ప్రశ్నకు జవాబు తెలుసుకునేముందు మనం ఒక విషయం గుర్తుంచుకో వాలి—భూమిపైన కనబడేదాన్నిబట్టి, చెట్టుఅంతా పైకే పెరుగుతుందని మనం అనుకొంటాము. కాని నిజానికి, చెట్టు అంతా పైకి పెరగదు. కొంతభాగం కిందికి పెరుగుతుంది. అదే వేరు. చెట్టుయొక్క ప్రతి భాగమున్ను తన పని ఉన్న వైపుకే పెరుగుతూ వుంటుంది. ఇలా జరగటానికి కారణం మేమిటంటే—



చెట్టును పుట్టించే విత్తులో కొన్ని అణువు లుంటాయి. అవి గాలిలో, వెలుతురులో పెరిగే భాగా లుగా తయారవుతాయి. వెలుతురు కనిపించే వైపుకే అవి పెరుగుతాయి.

ఇలా కాకుండా, విత్తులో ఉండే మరికొన్ని అణువులు చీకటిలోనే చక్కగా పెరగగలిగి వుంటాయి. అవి భూమ్యాకర్షణశక్తికికూడా కట్టువడి వుంటాయి. అందుచేత, ఈ అణువులు భూమిలోపలికే బాగా పెరుగుతై.

పోతే – మనం విత్తుతో తమాషాలు చేయవచ్చు. దానిని తలక్రిందుగా నాటుతామనుకుందాం. ఐనా మొక్కమట్టుకు పెరిగేటప్పుడు చుట్టుతిరిగి పెరుగుతుంది. ఎలాఅంటే : వెలుతురూ గాలీ ఉన్నవైపుకి— అనగా పైభాగానికి రెమ్మలూ, చీకటి ఉన్నవైపుకి- అనగా భూమికిందికి వేరులూ–పెరుగుతాయి.

ఇందువల్ల, మొక్కలన్నిటికీ రెండు ముఖ్యమైన భాగాలుంటాయని తెల్సుకోవచ్చు—ఒకటి : భూమిపైకి కనబడేదీ, రెండవది : మట్టిలో పాతుకు పోయేభాగమున్ను.

ఈ రెండుభాగాల్లో ఏఒకటీ రెండవదాని సాయంలేకుండా జీవించలేదు. చెట్టు నిర్మాణమే అంత. ఆకులూ, రెమ్మలూ, పువ్వులూ పెరిగేభాగం గాలి లోనూ, వెలుతురులోనూ పైకి పెరుగుతుంది. రెండవభాగం భూమిలో పాతుకు పోయి, నీటినీ లవణాలనూ పీల్చుకొని, చెట్టుకు నిలకడ కలిగిస్తుంది.




# అసహాయ శూరుడు

పూర్వకాలమందు మార్వార్ రాజ్యాన్ని రాజాగజసింగు పాలించుతూ ఉండేవాడు. ఆయన పెద్దకొడుకు అమరసింగు. తండ్రికీ కొడుక్కీ పడకపోవటంచేత, అమరసింగు గద్దెయెక్కకుండా తండ్రి తరిమివేశాడు.

అమరసింగును వెళ్లిపొమ్మన్న ఆ రోజున రాజ్యంలో అంతా దుఃఖించారు. ఇంత వరకు అమరసింగుకు ఆసరాగా ఉంటూ వచ్చిన సైనికులు ఈ సమయంలోకూడా అతనిని విడనాడక, వెంటవెళ్ళారు.

అమరసింగు సరాసరి పోయి, షాజహాను దర్శనంచేశాడు. మొగల్ ఫాదుషా షాజహాను, అమరసింగును చూస్తూనే, అతని సాహసపరాక్రమాలను గ్రహించాడు. మెచ్చుకుని ఒక గొప్ప పదవి యిచ్చాడు.

కొద్దిరోజులకే ఫాదుషా, తన ముఖ్యనగరాన్ని ఢిల్లీనుండి ఆగ్రాకు మార్చాడు. ఈ సందర్భంలో అమరసింగుకూ బికనీర్ ప్రభువుకూ మధ్యని పేచీపడింది. ఇద్దరూ తనచేతికిందివారే కనుక, సులువుగా పేచీ విడగొట్టవచ్చునని ఫాదుషా తలచాడు.

ఐతే - అమరసింగుకు ప్రతికూలంగా కుట్రలు జరిగినై. పగవాళ్ళు ఎక్కువైనారు. ఫాదుషాకు స్వయానా బావమరిది ఐన సలబత్‌ఖాన్ బద్ధశత్రువయ్యాడు. శత్రువులు ఎంతగా ఎక్కువైనా, ఎదటపడి అమరసింగును ఎదిరించటానికి ఒక్కళ్ళకూ ధైర్యం చాలిందికాదు. అందుచేత లోలోపలనే గోతులు తీస్తూ, అతన్ని ఎలా లొంగదీయడమా అని, సమయంకోసం కనిపెట్టుకునివున్నారు.

అమరసింగూ సలబత్‌ఖానూ రెండు పక్షాలుగా ఏర్పడ్డారు. ఐతే, సింగునుగురించి ముందుగానే ప్రతికక్షులు నూరిపోయటంచేత, ఫాదుషా తలకు విషం ఎక్కిపోయివున్నది. కనుక, అమరసింగు ఏమి చెప్ప

ఎస్. వేణుగోపాల్

కొన్నా ఫాదుషా వినిపించుకోలేదు. అమర సింగును దోషిగా ఎంచి, జరిమానా విధించాడు. పైగా, ఆ అపరాధరుసుము వసూలు చేయటానికని తన బావమరిది ఐన సలబత్‌ఖాన్‌నే నియమించాడు.

సలబత్‌ఖాను అహంకారపూరితుడు. తన కోరిక ఫలించినందుకు పొంగిపోతూ, ఒకనాడు నిండుదర్బారులో 'ఏమి, రుసుము చెల్లిస్తావా, లేవా?' అని అమర సింగును నిలదీసి అడిగాడు.

పౌరుషవంతుడైన సింగుకు ఈ మాట ఈటెపోటయింది. 'ఉండు, ఇప్పుడే, ఇక్కడే చెల్లించివేస్తా'నంటూ, ఖడ్గందూసి సలబత్‌ను నిలువుగా తెగవేశాడు. దర్బారంతా నిశ్శబ్దమైంది. ఫాదుషా అమర సింగును దూషించాడు. ఫాదుషాను లెక్క చేయక, మాటకు మాట బదులుతీర్చాడు అమరసింగు.

అంతలోనే, విచ్చుకత్తులతో సిద్ధంగా వున్న అమరసింగు సైనికులు ఖాన్ బలగం పైన తలపడ్డారు. పోరు జరిగింది. కొద్ది సేపటిలోనే నెత్తురుకాలవలు ప్రవహించినై.

ఫాదుషా ఉగ్రుడై, 'సింగును పట్టండి, చంపండి!' అంటూ హెచ్చరికచేశాడు.



ఆ సమయంలో అమరసింగు కొదమ సింగంలాగా యుద్ధరంగంమీదికి ఉరికాడు. శత్రువులు అతనిని చుట్టుముట్టారు. అందరిమధ్యనీ అతని ఖడ్గం మెరపులాగా మెరిసింది. ఒక్కచేతితో వాళ్ళనందరినీ చెండాడి, నేలకూల్చాడు. అందరి తలలూ తెగిపడినై. ఫాదుషానుకూడా వేటువేయా లనుకున్నాడు. కాని, ఈ సంగతి తెలిసి, ఫాదుషా జనానాకు పారిపోయి తల దాచుకొన్నాడు.

ఆగ్రాలోని యెర్రకోట రక్తమయమై వుంది. కోటలో పరివారమంతా గజగజ




వణికిపోతున్నారు. అమరసింగును కన్నెత్తి ఐనా చూడలేకపోయారు ఒక్కళ్ళూ. శత్రువులనందరనూ తునుమాడిన అమరసింగు ఆలోచిస్తూ, మెల్లగా అడుగులు వేసుకొంటూ నడుస్తున్నాడు.

మరునాడు—ఫాదుపా ఒక బంగారు పళ్ళెం దర్బారుమందిరంలో పెట్టించి, 'అమరసింగు తలకాయ ఎవరైతే కొట్టి తెస్తారో, వాళ్ళకి ఈ బహుమానం' అని ప్రకటించాడు. ప్రకటన విన్నారేకాని, ఎవ్వరూ సాహసించి ముందుకు రాలేదు. చివరకు, అమరసింగు బావమరిది, అర్జునగౌడ్ ముందుకు వచ్చాడు. 'తొందర పడవద్దుసుమా' అని ఫాదుపా హెచ్చరించాడు. 'తెలిసే వచ్చా'నన్నాడు అర్జునగౌడ్.

ఇంతవరకూ బావమరదు లిద్దరకూ మనస్పర్ధలుగా ఉంటూవుండె. ఐనా గౌడ్, తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో అమరసింగు వద్దకు వెళ్ళి, ఫాదుపాతో రాజీ పడమని హితబోధ చేశాడు. ఈ మాటకు అమరసింగు తాచులాగా లేచాడు. ఎలాఐతేనేం, ఉభయులూ ఫాదుపా దర్శనంచేసుకోవటానికి గౌడ్ అతనిచేత వప్పించాడు.

ఇద్దరూ ఒక చిన్న ద్వారంలోనుండి వెళ్ళటానికి ఏర్పాటు జరిగింది. తీరా అక్కడికి వెళ్ళేసరికి, ఆ ద్వారం పొట్టిగా వుండి తలకు తగిలేటట్టు కనిపించింది. తల వంచడమంటే అమరసింగుకు మనస్కరించలేదు. అప్పుడు గౌడు, ప్రక్కనే వున్న ఒక కిటికీ చూపించి, దానిలో కాళ్లు దూర్చి ముందుగా సింగును దిగమన్నాడు. అమాయకుడైన అమరసింగు కొంచెమైనా ఆలోచించక, బావమరది చెప్పినట్టే చేశాడు. అమరసింగు కాళ్ళను కంతలో దూర్చగానే, గౌడు అతని గుండెలో బాకు గుచ్చివేశాడు! అమరసింగు నిస్సహాయుడైనాడు. ఐనా,

అతి ప్రయత్నంమీద ఆ ద్రోహిని ముక్కు నరికివేసి, మరీ ప్రాణాలు విడిచాడు.

తక్షణమే, అర్జునగౌడు తన బావమరది తలను తెగవేసి, ఎంతో గర్వంతో ఫాదుషాకు బహుమతిగా తీసుకవెళ్ళాడు. ఐతే, ఫాదుషా అర్జునగౌడ్ చర్యలను వినగానే, అతను పరమద్రోహి అని తెలుసుకొని 'ముఖానికి మసిపూసి, గాడిదపైన కూర్చోబెట్టి ఊరేగించి, తల తీసివేయు'మని భటులకు ఆజ్ఞాపించాడు.

తరువాత—అమరసింగు మరణవార్త ఆతని భార్య హరిరాణి చెవినిపడింది. ఆమె పతితోపాటు సహగమనం చేయాలనుకున్నది. ఐతే, పతి కళేబరం ఫాదుషా కోటలో చిక్కుకొన్నదాయె! ఎలా?

అప్పుడు పౌరుషశాలి ఐన రామ్‌సింగు—అమరసింగు మేనల్లుడు—ఒక నూరుమంది సైనికులను వెంటబెట్టుకుని, 'మామయ్య శవం నేను తెస్తా' నన్నాడు, ధైర్యంగా. పాపం, పసివాడివల్ల నేమవుతుంది? అకారణంగా పిన్నవాడు మొగలులకు బలి ఐపోతాడే! అని హరిరాణి దూరం యోచించింది.

అప్పుడు గత్యంతరం లేక, ఆమె తన మరది భల్లూసింగును బతిమలాడింది.




భల్లూసింగుకీ అమె భర్తకీ యేనాటినించో మాటలులేవు. ఐనా, ఈ ఆపదసమయంలో అమెకు వేరే దారి తోచలేదు.

"నాయనా!—నీ అన్న తురకల చేతులలో ఘోరమరణం పొంది, నన్ను విడనాడిపోయారు. సహగమనంచేసి ఆయనతోపాటు స్వర్గం చేరటమే నాకు తరణోపాయం. ఐతే, అయన కళేబరం ఎర్రకోటలో చిక్కుకుపోయింది! మహావీరుడైనటువంటి నీ అన్న కళేబరం ఎలాఐనా తీసుకురా. దిక్కులేని నాకు గతులు కల్పించు. కుటుంబగౌరవం నిలుపు. రాజపుత్రపౌరుషం చూపవలసిన

సమయం వచ్చింది. లే, వెళ్లు!" అని లేఖ వ్రాసి పంపింది ఆమె, మరడికి.

లేఖ చూడగానే భల్లా మనసు ఊగిస లాడింది. ఊరుకుందామనిపించింది కాని, అతనివాలకం కనిపెట్టి అతని భార్య, "మీరు ఇంట్లో వుండండి. నేను పోయి కళేబరం తీసుకువస్తా"నన్నది. ఈమాట విన గానే భల్లాకు పౌరుషం పొంగింది. తక్షణమే పరివారాన్ని వెంటబెట్టుకొని బయల్దేరాడు. భల్లాతో పసివాడు రామ్‌సింగుకూడా వెంట బడ్డాడు. భల్లా తన పరివారంతో—

"మహావీరుడైన నా సోదరుని ఆత్మ మనవైపు చూస్తున్నది! అతని వంశగౌరవం నిలపడమో మంట కలపటమో మన చేతు లలో వున్నది!!" అని హెచ్చరించేసరికి, 'మేము ఏత్యాగాన్నయినా చేస్తా'మని వీరు లందరూ ప్రమాణంచేశారు.

ఈవిధంగా ఐదువందలమంది వీరులతో భల్లాసింగూ, రామ్‌సింగూ బయల్దేరి, ఫాదుషా కోటలోకి చొరుచుకుపోయి, అమర సింగ్ కళేబరమున్నచోటికి చేరుకున్నారు.

కళేబరం చూచి భల్లాసింగు జలజల కన్నీరు విడిచాడు. తక్షణమే దానిని భుజాల పైన వేసికొని, దౌడుతీశాడు!!

అంతలోనే మొగలులు మేలుకొన్నారు. సంజ్ఞలుచేశారు. రాజపుత్రవీరులను చుట్టు ముట్టారు. కాని రాజపుత్రసైనికులు పోరాడి, శత్రువులు భల్లాసింగు వెంటపడకుండా నిలిపివేశారు. అప్పటికే, భల్లాసింగు కోట దాటి ఎంతోదూరం వెళ్ళి పోయాడు.

మొగలులు వూరుకోలేదు. శత్రువులను తరుముకొనిపోయి, హరిరాణి సహగమనం చేసే తావుకు చేరుకొన్నారు. కాని, వాళ్ళు చేరుకునేసరికే ఆమె సహగమనం ఏఆటం కమూ లేకుండా పూర్తిఐపోయింది.

అమరసింగు అద్భుతచరిత్రను ఉత్తర దేశంలో యీనాటికీ ఒక అమరగాథగా చెప్పుకొని, తన్మయులవుతారు.



# 9 మాహాత్మ్యం

మా వరవడిని అందిపుచ్చుకుని, ఈ శీర్షిక కింద మరి అనేక చిత్రాలను పాఠకులు యేర్చి కూర్చి పంపినందుకు చాలా సంతోషిస్తున్నాము. పాఠకులు పంపిన తమాషాలలో కొన్ని ఇవి :—

(1) 9 తొమ్మిది అంకెలతో ఒక వేడుక గుణకారం చెబుతా. ఈ ప్రక్కని చూడండి :—

```
                12345679
               999999999
        -----------------
               111111111
              111111111
             111111111
            111111111
           111111111
          111111111
         111111111
        111111111
       111111111
-------------------------
       12345678987654321
```

—వడ్లమాని హనుమాయమ్మ - అమలాపురం

(2) 1 మొదలుకుని (8 అంకె తప్ప) 9 వరకు గల అంకెలను వరసగా వెయ్యి. ఈ సంఖ్యను 9 చేతగాని, తొమ్మిదిచే గుణింపబడే మరి ఏ యితర సంఖ్యచేతగాని గుణించు. అలా గుణించగా వచ్చే జవాబులోని చిత్రం చూచుకో. మచ్చుకి :—

$$12345679 \times 9 = 111,111,111$$
$$12345679 \times 18 = 222,222,222$$
$$12345679 \times 27 = 333,333,333$$

ఇదేమోస్తరుగా 36, 45, 54, 63, 72, 81 చేత గుణించిచూడు.

—యం. వి. యస్. రామలింగేశ్వరరావు - భట్టిప్రోలు

(3) ఏ అంకెనయినా 9 చేత భాగించగా వచ్చే శేషం కనుక్కోవటంలో గమ్మత్తు : ఉదాహరణ :—33785 అనే ఒకసంఖ్య తీసికో. ఈ అంకెలన్నిటినీ కలుపు. అనగా— 3 + 3 + 7 + 8 + 5 = 26. 26 ని మళ్ళీ కలుపు, అనగా 2+6=8. ఈ విధంగా 33785 ను 9 చేత భాగిస్తే వచ్చే శేషం 8 అని వెంటనే చెప్పేసుకోవచ్చు. ఇదేమోస్తరుగా ఎంతపెద్ద సంఖ్యనైనా 9 చేత బాగించటంలో వచ్చే శేషం చెప్పగలం.

—పి. సంధ్య - నెల్లూరు

[వచ్చేనెల మరికొన్ని]

## బదులు చెప్పు

1. ప్రపంచంలోకెల్లా పెద్దద్వీపం ఏది?
   - ఇంగ్లండు
   - గ్రీన్లాండు
   - బోర్నియో

2. క్రిందినదులలో ఏది పెద్దది?
   - సింధు
   - బ్రహ్మపుత్ర
   - గంగ

3. ప్రపంచంలోకెల్లా పెద్దగ్రంథాలయం ఎక్కడ వున్నది?
   - అమెరికా
   - బ్రిటన్
   - రష్యా

4. హలంపట్టిన కవి యెవరు?
   - శ్రీనాథుడు
   - పోతన
   - పెద్దన

5. అచ్చుయంత్రాన్ని మొట్టమొదట కనిపెట్టింది ఏదేశం?
   - భారతదేశం
   - ఈజిప్టు
   - చైనా

6. టెలిగ్రాఫ్ కనిపెట్టింది ఎవరు?
   - మోర్స్
   - బెల్
   - ఎడిసన్

—[58-వ పేజి చూడు]

## పిల్లిబావగారి కాశీయాత్ర



పుణ్యం సంపాదించుకుందామని పిల్లిబావగారు కాశీయాత్రకు బయలుదేరారు. త్రోవలో ఒక బల్లీ, ఒక ఉడుతా కనుపించి మేముకూడా వెంటవస్తామన్నాయి. పిల్లిబావకు సంతోషం కలిగింది. 'సరే, రండి' అన్నారు. అప్పుడు బల్లీ ఉడుతా రెండూ వెంబడే బయలుదేరాయి. ఐతే, కొంచెందూరం వెళ్ళాక అవి కనుపించకుండాపోయాయి. పాపం పిల్లిబావగారు 'పుణ్యానికిపోతే పాపం తలకు చుట్టుకొందే' అని చాలా విచారించారు. పాపాయిలూ!— ఆ బల్లీ, ఉడుతా, ఏమైపోయినవో కనుక్కోగలరా? కనుక్కోగలిగితే పాపం, పిల్లిబావగారికి చాలా సాయంచేసినవారౌతారు.

# అట్టచివరిబొమ్మ

ఎదట ప్రత్యక్షమైన ఆ అందాలచిన్నది తన శాపవృత్తాంతం ఇలా వినికిడి చేసింది :—"రాజకుమారా, నా పేరు రత్నమాల. మా అమ్మకు ఉద్యాన వనాలలో విహరించడమంటే కుతూహలం. అందుచేత, ఎక్కడ ఉద్యానం కనిపిస్తే అక్కడికి వెళ్ళేది.

ఒకప్పుడు ఆమె ఒక సుందరమైన ఉద్యానంలో ప్రవేశించి అక్కడ చిత్రమైన పండ్లు కోసుకోబోయింది. అంతలో ఒక ముసలి రక్కసి వచ్చి, "అమ్మాయీ! ఒక వాగ్దానంచేస్తే, కావలసిన పండ్లు ఆరగించవచ్చు" అన్నది.

అందుకు నాతల్లి 'సరే'నంది. అప్పుడు వృద్ధురాలు "నీకు పుట్టిన తొలి బిడ్డను నాకివ్వాలి" అని కోరగా, మాటయిచ్చి మా అమ్మ ఇష్టమొచ్చినన్ని పండ్లు తిన్నది. కొంతకాలానికి నేను పుట్టాను. కాని, నా తలిదండ్రులు నన్ను దాచివేసి, రహస్యంగా పెంచుతూవచ్చారు. ఐతే—ఈసంగతి ఎలాగో రక్కసి చెవులబడి. అది ఉగ్రురాలై ఒక భూతసర్పాన్ని రాజ్యంలోకి పంపించింది. ఆ సర్పం అందరినీ పొట్టనుపెట్టుకోసాగింది. చివరకు నా తలిదండ్రులు నన్ను రక్కసికి వప్పగించినతరవాతగాని, భూతం రాజ్యంవదిలి పోలేదు.

నేనూ, నా పరివారమూ ఆ రక్కసి భవనంలో ఉంటున్నాము. ఒకనాడు ఒక సుందరాకారుడైన రాజకుమారుడు నా కంటబడ్డాడు. అతనిని నా భర్తగా చేసికోవాలెననే ఉబలాటంతో పారిపోవటానికి యత్నించాను. అంతలో ముసిలిది ప్రత్యక్షమై, నన్నూ నా పరివారాన్నీ పిల్లులుగా మార్చివేసింది. మా ఉపచారాలకుగాను మహిమగల హస్తాలను ఏర్పాటుచేసింది.

తరువాత నేను బతిమాలేసరికి, ఆ వృద్ధరక్కసి జాలిపడి "అమ్మాయీ! ఏ రాజకుమారుణ్ణిఐతే చూచి నీవు మక్కువపడ్డావో, ఆతనివల్లనే నీకు శాపవిముక్తి కలుగుతుంది" అని చెప్పింది. నీ చిత్రపటం తయారుచేసుకొని, గోడను అలంకరించుకుని, నాటినించీ అరాధిస్తూవున్నాను. కృపాసేనా! నాకు శాపం తొలగించి పుణ్యంకట్టుకొన్న ఆ రాజకుమారుడవు నీవే!" అని చెప్పి ముగించింది రత్నమాల.

## ఒంటిగీత బొమ్మ



పంపినవారు :
ఎస్. జి. సీతారామాచార్య-సికంద్రాబాద్

## వినోదం

యజమాని తన నవుకరును పిలిచి, యిలా చెప్పాడు : "నీవు బాగుపడటానికి మంచి అవకాశం కల్పిస్తున్నాను. రేపటినుంచీ నీవు పనికి రానక్కరలేదు."

ఈనెల 'బదులుచెప్పు' జవాబులు

1. గ్రీన్లాండు
2. సింధు
3. రష్యా
4. పోతన
5. చైనా
6. మోర్స్

## ఫోటో వ్యాఖ్యల పోటీ

జూన్‌నెల ఫలితాలు



జూన్‌నెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫొటో : మీనుల పంట

రెండవ ఫొటో : మానుల జంట

పంపినవారు :

డి. అజంతాదేవి - చిత్తూరు

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా జూన్‌నెల చందమామ ఫొటోల దిగువని ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- జూన్ సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



## జూలై నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్క పేజీలో చూడండి.

ముఖ్యసూచన :

వ్యాఖ్యలను ప్రక్క పేజీలోని కూపన్‌లోనే పూర్తిచేసి పంపాలి. పూర్తిచేసిన కూపను బుక్‌పోస్టులో పంపవచ్చు. ఇందుతో ఎటువంటి జాబులను జతపరచకూడదు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1953 జూలై సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై రెండు ఫోటోలకూ సరియైన వ్యాఖ్యలు కావాలి. వ్యాఖ్య ముచ్చటైన ఒక్క మాటలో గానీ, చిన్నివాక్యంలోగానీ ఉండవచ్చు. మొదటిఫోటోకూ రెండవ ఫోటోకూ వ్యాఖ్యలు సంబంధం కలిగివుండాలి.

★ మే 10-వ తేదిలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ దిగువ కూపన్‌లో వ్యాఖ్యలు రెండూ పూర్తి చేసి, ఈ అడ్రసుకు పంపాలి.:—చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

★ చందమామ కూపన్లలోగాక, ఇతర విధముల పంపే వ్యాఖ్యలు పోటీకి పనికిరావు.

——→ చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ కూపన్ ←——

మొదటి ఫోటో

వ్యాఖ్య ......................................

రెండవ ఫోటో

వ్యాఖ్య ......................................

పంపినవారి పేరు ......................................

పూర్తి చిరునామా......................................






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

విద్వత్‌గానం

పంపినవారు:
సి. పి. శ్రీనాథ్ - వెల్లూరు

